PARLE

# FREE

# TOM and JERRY



# MAGIC TATTOOS

2 ఇన్ 1 మేజిక్ టాటూస్, ఇవి
ఎండలో కలర్ మారుతాయి,
మరియు చీకటిలో మెరుస్తాయి

పొందేందుకు కొనండి










1 పాపిన్స్ లేదా 2 మెలోడీ చాక్లేట్ లేదా 4 స్మూథీస

CARTOON NETWORK™


బూటకయ్య పండిత సభలు (బే.క)
19


అప్పివ్వనివాడు
26


మాయాసరోవరం
13


విఘ్నేశ్వరుడు
45



## ఈ సంచికలో...



SUBSCRIPTION

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**

***Remittances in favour of Chandmama India Ltd.***
to

Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ. **120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ,
మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్'
పేరిట పంపండి.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# దేశ ఆరోగ్యసూచిక!

ఒకప్పుడు ప్రజలను భయభ్రాంతులకు గురిచేసిన మహమ్మారి మశూచి, సమూలంగా నిర్మూలించబడిందని ప్రకటించడంతో - దాదాపు ముప్ఫైయేళ్ళ క్రితం, ప్రపంచం పెద్ద గండం నుంచి బయటపడినట్టు సంతోషించింది. మరొక ప్రమాద కరమైన వ్యాధి - పోలియోను కూడా నిర్మూలించడానికి ప్రపంచవ్యాప్తంగా ప్రయత్నాలు మొదలయ్యాయి. 2005 లోగా ఈ లక్ష్యాన్ని సాధించాలని ప్రకటించారు. ప్రజల ఆరోగ్యం పట్ల కొన్ని సంస్థలకున్న శ్రద్ధాసక్తులకూ, నిబద్ధతకూ ఇదొక ప్రత్యక్ష నిదర్శనం!

చాలా వ్యాధులు రాకుండా నిరోధించడానికి టీకాలూ; నివారించడానికి ఔషధాలూ ఉన్నాయి. అయితే, అంతుబట్టని వ్యాధులు విరుచుకుపడడం కూడా అరుదైన విషయమేం కాదు. అందువల్ల వ్యాధినిరోధక విధానాలూ, నివారణ ఔషధాలూ కనుగొనడానికి, ప్రపంచ ఆరోగ్యసంస్థ వంటి ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలు నిరంతర పరిశోధనలు జరుపుతూ, నిర్విరామంగా కృషిచేస్తున్నాయి.

అయినా, ఇతరుల ఆరోగ్యం పట్ల మనం చాలినంత శ్రద్ధ చూపుతున్నామా అన్నది అనుమానమే. ముఖ్యంగా భావిపౌరులైన పిల్లల ఆరోగ్యం పట్ల మనం చూపుతూన్న ఉదాసీనత అసలు పనికిరాదు. పిల్లల ఆరోగ్యం సురక్షితంగా ఉన్నప్పుడే దేశ భవిష్యత్తు ప్రకాశవంతంగా ఉంటుంది. పిల్లల ఆరోగ్యమే దేశ ఆరోగ్య సూచిక. అందువల్ల, ఈ విషయంలో ఏమాత్రం నిర్లక్ష్యం చూపకుండా - పిల్లల ఆరోగ్య పరిరక్షణ కోసం కృషి చేస్తూన్న సంస్థలతో చేతులు కలిపి, పిల్లల ఆరోగ్యాభివృద్ధికి పాటుపడడం తల్లిదండ్రుల ప్రధాన కర్తవ్యం!

సంపాదకుడు : విశ్వం
Visit us at : http://www.chandamama.org

## హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా-20

ఇక్కడ కొందరు పూర్వకవులు, గీత రచయితలను గురించి ప్రస్తావించాము. వారిని గురించి మీకు తెలుసా?

**అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!***

**1** నేనొక భక్తకవిని. భజనలు, దోహాలు రచించడంతో పాటు సంఘ సంస్కర్తగానూ, మతసంస్కర్తగానూ పేరుగాంచాను. నేనెవరిని?

---

**2** నేను వివిధ శీర్షికలలో తమిళంలో 1,330 ద్విపదలు రచించాను. నా పేరేమిటి?

---

**3** నేను పాండురంగణ్ణి స్తుతిస్తూ మరాఠీ భాషలో 5000 'అభంగ్'లు రచించాను. నేనెవరో మీకు తెలుసా?

---



**4** కవిచక్రవర్తి అనే బిరుదనామం కలవాణ్ణి. రామాయణాన్ని తమిళ భాషలో 10,000 పద్యాలలో రచించాను. నా పేరు చెప్పండి?

---

**5** 'సుర్ సాగర్' అనే మహాగ్రంథాన్ని రచించాను. బ్రిజ్ భాషలో రచించిన ఈ గ్రంథంలో 1,00,000 పద్యాలు ఉన్నాయి.

---

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన కవి ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

**నా అభిమాన కవి:**

..................................................

..................................................

పాల్గొనేవారి పేరు: ..................................

వయసు:............తరగతి: ..............................

చిరునామా:..............................................

..................................................

పిన్: ......................... ఫోన్: .........................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం:......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2003 జూన్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-20
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ
ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు




<u>సూచనలు:</u>

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువవచ్చినట్టయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

# మంచి పొరుగు

హేలాపురి చిన్నవీధిలో పురుషోత్తం, వెంకటాచారివి ఇరుగుపొరుగు ఇళ్ళు. ఇద్దరివీ పెద్దలు కట్టించిన సొంత ఇళ్ళే. ఆస్తి విషయంలో సమానులే అయినప్పటికీ, ఎదుటివారికన్నా తమనే గొప్పవాళ్ళుగా చూపుకోవాలనే పోటీ మనస్తత్వం రెండు కుటుంబాలలోనూ ఉండేది.

తమ రెండు ఇళ్ళమధ్య ఉన్న ప్రహరీగోడ విషయంలోనో, ఆ ఇంటి ఆవరణలోని చెట్టు కొమ్మలు, ఈ ఇంటిమీద వాలుతున్నాయనో మగవాళ్ళు గొడవలు పడుతూండేవాళ్ళు. చెత్త పారబోసే విషయంలోనో, పెరట్లో మురుగు నీళ్ళు వస్తున్నాయనో ఆడవాళ్ళు తరచూ కీచులాడుకునేవాళ్ళు.

ఇలా రోజూ తగవులాడుకోవడం రెండు ఇళ్ళవాళ్ళకూ విసుగ్గా ఉండేది. అయితే సఖ్యంగా ఉండడానికి ఎవరూ ప్రయత్నించలేదు.

ఆ సమయంలో పెద్దవీధిలో ఒక ఇల్లు అమ్మకానికి వస్తున్నదని తెలియగానే వెంకటాచారి, ఆ విషయం పురుషోత్తానికి తెలియనీయకుండా జాగ్రత్తపడ్డాడు. తమ ఇంటిని సుగంధపురి నుంచి వచ్చిన కృపాకరుడికి అమ్మేసి, పెద్దవీధిలోని ఇల్లు తాను కొనేశాడు.

వెంకటాచారి ఇల్లు ఖాళీచేసి వెళుతూ, ''పెద్దవీధిలో బ్రహ్మాండమైన ఇల్లు కొన్నాం. పైగా ఇక మీదట మంచి పొరుగున కూడా ఉండబోతున్నాం,'' అన్నాడు పురుషోత్తంతో గొప్పగా.

''మీరేకాదు. మేము కూడా మంచి పొరుగునే ఉండబోతున్నాం!'' అన్నాడు పురుషోత్తం.

''అదేమిటి, ఊళ్ళో అమ్మకానికి వచ్చింది ఒక్క ఇల్లే కదా? దాన్ని మేము కొనేశాం. కొంపదీసి ఊరు వదిలే వెళ్ళిపోతున్నారా ఏం?'' అన్నాడు వెంకటాచారి నవ్వుతూ.

''ఊరు వదిలి వెళ్ళాల్సిన ఖర్మ మాకేం లేదు. పెద్దలు కట్టించిన ఇదే ఇంట్లోనే దర్జాగా ఉంటున్నాం. అదీ మంచి పొరుగున. మీరుగాక వేరేవారెవరైనా మాకు మంచి పొరుగువారే కదా?'' అన్నాడు పురుషోత్తం చురక వేస్తూ.

**-కోనే నాగవెంకట ఆంజనేయులు.**





# నిజమైన కురూపి

జగన్నాథపురం అనే గ్రామంలో జగ్గన్న అనే రైతుకు–వీరన్న, సూరన్న అని ఇద్దరు కొడుకు లుండేవారు. పెద్దవాడైన వీరన్నకు చిన్నతనంలో, పెద్ద బానలో తెర్లుతున్న వేడినీళ్ళు ముఖం మీద పడి, అక్కడక్కడా నల్లని మచ్చలు ఏర్పడినై. అందువల్ల కాస్త వికారంగా కనిపించే వాడు. అయితే, వాడి మనసు ఎంతో మంచిది. ప్రవర్తనలో ఏమాత్రం దుడుకుతనం వుండేది కాదు. కానీ, వాడి తమ్ముడు సూరన్న మాత్రం అన్నతో పోల్చుకుని, తాను గొప్ప అందగాడినని గర్వపడుతూండేవాడు.

ఒక రోజున జగ్గన్న పొలంలో మేకల్ని మందకట్టాడు. అది, వేసవికాలం. వీరన్న, సూరన్న చుట్టుపక్కల వున్న చెట్ల నుంచి చిన్న చిన్న కొమ్మలు కొట్టుకు వచ్చి, వాటి ఆకులను మేకలకు మేపుతున్నారు.

అంత ఎండలో ఓపిగ్గా పనిచేస్తున్న తన కొడుకులకేసి చూసి, జగ్గన్న తృప్తిగా తలాడించి పెద్దకొడుకు వీరన్నతో, ''ఒరే, వీరా! దిబ్బ మీద వున్న తేగల పాతర నుంచి ఇన్ని తేగలు తవ్వి తీసుకురా. తంపటివేసుకుని తిందాం,'' అన్నాడు.

కాసేపట్లో వీరన్న తేగలు తవ్వి తీసుకు వచ్చాడు. ఈ లోపల సూరన్న అక్కడ చెట్లకింద పడివున్న చిన్నా పెద్ద ఎండుపుల్లలు పోగుచేసి, తేగలమీద కుండ బోర్లించి, ఆ పుల్లలతో మంట చేసి తేగలకు తంపటివేశాడు. తంపటిపూర్తయి, తండ్రీ కొడుకులు తేగలను మంటలో నుంచి బయటకు తీస్తూండగా, గ్రామ పురోహితుడు పుల్లన్నశాస్త్రి అటుగా వచ్చాడు.

జగ్గన్న ఆయన్ను చూసి సంతోషంగా, ''సమయానికి వచ్చారు, శాస్త్రిగారూ! మరి కొన్ని తేగలు తవ్వించి ఇస్తాను, పట్టుకెళ తారా?'' అన్నాడు.

''నిండువరహాచేసే మాటన్నావు, చాలా సంతోషం. నీ మనసు మహాదొడ్డది. అలాగే ఇవ్వు, సంతోషంగా పట్టుకెళతాను. కానీ, ఇంత ఎండలో పడి నీ పొలం దగ్గరకు వచ్చిన

డా. జొన్నలగడ్డ మార్కండేయులు



ఇంతలో సూరన్న తవ్వితెచ్చిన తేగల్ని చెట్టుకిందకి తెచ్చి కట్టకడుతూ, "శాస్త్రిగారూ! ఇలా అన్నానని ఏం అనుకోకండి. నేనందంగా వుంటాను. నాకు పెళ్ళవడం ఏమీ కష్టం కాదు. నాకన్న పెద్దవాడు కాబట్టి, మా అన్నను కురూపి అని నా నోటితో నేననకూడదు. ముందు ఆయన పెళ్ళయితే తప్ప, నాకు పెళ్ళి కుదరదు. ఏదో గంతకు తగ్గ బొంత అంటారే - ఆ విధంగా మా అన్నకు ఏదైనా సంబంధం చూడండి," అన్నాడు.

సూరన్న మాటలు వీరన్నకు చాలా బాధ కలిగించాయి. జగ్గన్నకు కోపం వచ్చినా బాధతో వీరన్నకేసి చూస్తూ సూరన్ననేమీ అనలేకపోయాడు.

పుల్లన్నశాస్త్రి, సూరన్న అందించిన తేగల కట్ట తీసుకుంటూ, "తప్పు, సూరన్నా! ఎదుటివాళ్ళను బాధపెట్టేలా మాట్లాడడమన్నది, కురూపితనం కన్న చెడ్డది," అని, వీరన్నకేసి తల తిప్పి, "వీరన్నా! మనిషికి అందం కన్నా, మంచిగుణం ప్రధానం. నీ సుగుణాన్ని గుర్తించే మంచి భార్య వస్తుందని, నా నమ్మకం. గోవిందపురం వెళ్ళి గున్నప్పను కలిస్తే, నీకు మేలు జరుగుతుంది. కలవగలిగితే కలువు," అన్నాడు.

వీరన్నకు, పుల్లన్నశాస్త్రి మాటలు కుతూహలం కలిగించాయి. ఒక రోజున పనిగట్టుకుని గోవిందపురం వెళ్ళాడు. గున్నప్ప ఇల్లు కనుక్కోవడం వీరన్నకు ఏమీ కష్టం కాలేదు. గున్నప్పది పూలమొక్కలమ్మే వ్యాపారం. తన పొలంలోనే రకరకాల పూలమొక్కలు పెంచి, పెరట్లో మొక్కలు వేసుకునే గృహయజమానులకు అమ్ముతూంటాడు. అతడు

ముఖ్యమైన పని మరొకటి వుంది!" అంటూ ఆగాడు శాస్త్రి.

"సందేహించకుండా చెప్పండి, శాస్త్రిగారూ," అన్నాడు జగ్గన్న.

"అయితే, విను జగ్గన్నా! ఊరిని నమ్ముకున్న పురోహితుణ్ణి. దానంగా వచ్చిన గోవులను మేపడానికి గడ్డి కావాలిగదా! నీ ఇంటి పురోహితుడిగా, ఒక మోపు గడ్డి ఇవ్వమని అడగడానికి వచ్చాను," అన్నాడు శాస్త్రి.

జగ్గన్న, తేగలు తవ్వి తెమ్మని సూరన్నకు చెప్పి, శాస్త్రితో, "ఆవుల్ని మేపడంలో మీకెలాంటి ఇబ్బంది వచ్చినా, వాటిని నాకు తోలిపెట్టండి. నా పశువులతోపాటు మేపుతాను. గడ్డిమోపు నా కొడుకుల్లో ఎవడో ఒకడు, మీ ఇంటికి తెచ్చి ఇస్తాడు. రండి, ఆ చెట్టు నీడనకూర్చుందాం," అంటూ దాపులనున్న చెట్టు కేసి దారితీశాడు. వీరన్న కూడా వాళ్ళ వెనగ్గా నడిచాడు.

తన పొలంలోనే మంచి ఇల్లు కట్టుకుని భార్య గంగమ్మ, కూతురు జ్యోతితో సుఖంగా వుంటున్నాడు.

వీరన్న పూలమొక్కలు కొనడానికి వచ్చాడనుకున్నాడు గున్నప్ప. కానీ వీరన్న, పుల్లన్న శాస్త్రి మాటమీద వచ్చాడని తెలుసుకుని, సాదరంగా ఆహ్వానించి భార్యనూ, కూతురినీ పరిచయం చేశాడు.

కొంతసేపు జగన్నాధపురంలో తను ఎరిగి వున్నవాళ్ళ గురించి మాట్లాడిన తర్వాత గున్నప్ప, వీరన్నతో, "బాబూ! కొన్నేళ్ళ కిందట నేను దొంగతనం చేస్తూ పట్టుబడి చెరసాలలో వున్నాను. దొంగఅని ముద్రపడిచెరసాల నుంచి బయటికి వచ్చాక అవమానాలేగాని ఎక్కడా ఆకలి చల్లారే పని దొరకలేదు.అందుచేత మళ్ళీ చెరసాలకు పోవాలని - ఏ ఇంట దొంగతనం చేస్తూ పట్టుబడ్డానో, ఆ ఇంటికే మళ్ళీ కన్నం వేసి కావాలని దొరికిపోయాను. ఆ ఇంటి యజమాని చాలా మంచివాడు, వివేకవంతుడు. 'పుట్టుకతో ఎవరూ దొంగ కాదు. పరిస్థితుల కారణంగా దొంగతనం చేశావు. శిక్ష నీలో మార్పు తేలేదు. నిన్ను మళ్ళీ చెరసాలలో వేయించి తప్పు చేయను,' అని నన్ను తన ఇంట్లోపనికి పెట్టుకున్నాడు. ఆ తర్వాతరెండు సంవత్సరాలకు, నేను పూర్తిగా మారానన్న నమ్మకం కుదిరాక - అంతో ఇంతో ఆస్తి సంపాయించిన తన పాలేరు కూతురు, ఈ గంగమ్మతో, నాకు పెళ్ళి జరిపించాడు. నేను ఈవిడ వల్ల నలుగురిలో గౌరవం సంపాయించినా, నేను గతంలో దొంగనన్న కారణంగా, నా కూతురు జ్యోతిని పెళ్ళాడేందుకు ఎవరూ ముందుకు రావడం లేదు. 'నువ్వు కూడా చెరసాల నుంచి



ఒక దొంగను అల్లుడుగా తెచ్చుకో,' అని హేళన చేస్తున్నారు,'' అన్నాడు దిగులుగా.

వీరన్న ఏం మాట్లాడాలా అని ఆలోచిస్తు న్నంతలో గంగమ్మ, ''మనిషికి అందం కాదు; గుణం ప్రధానం. నీ గురించి పుల్లన్నశాస్త్రిగారు చెప్పారు. మా అమ్మాయినిచ్చి పెళ్ళి చేస్తాము. ఏమంటావు?'' అని అడిగింది.

ఆ వెంటనే వీరన్న, ''నేను అంతో ఇంతో వికారినన్న సంగతి, నాకు బాగా తెలుసు. మీ పరిస్థితిని ఆసరాగా తీసుకుని, మీఅమ్మాయికి మనస్తాపం కలిగిస్తూ, నేను భర్తను కాలేను. నాకొక తమ్ముడున్నాడు. మీ అమ్మాయి అందచందాలకు వాడు తగిన భర్త,'' అని ఇంటికి కబురు పంపాడు.

జగ్గన్న, అతడి భార్య, కొడుకు సూరన్న గోవిందపురం వచ్చారు. సూరన్న, జ్యోతి అందానికి మురిసిపోయినా, గున్నప్ప గత జీవితం గురించి తెలుసుకున్నాక, మండిపడి – ఒక దొంగ కూతుర్ని ఏ పరిస్థితుల్లోనూ పెళ్ళి చేసుకోనని అందరి ఎదటా ఈసడించాడు.

అంతవరకూ తల వంచుకుని సూరన్న అవహేళనగా మాట్లాడడాన్ని సహించిన జ్యోతి, ఒక్కసారిగా ఉగ్రురాలైపోయి, సూరన్న ముఖం లోకి సూటిగా చూస్తూ, ''ఏమిటయ్యా, నీ వెకిలిమాటలూ నువ్వూ! కోకిలపిల్లకూ, కాకి పిల్లకూ రూపంలో పెద్ద తేడా వుండదు, పైగా ఒకేచోట పెరుగుతాయి. కోకిల చక్కని కంఠ స్వరంతో అందరినీ మెప్పిస్తుంది. మనుషుల్లో కూడా కాకుల్లాంటి వాళ్ళుంటారని, నీలాంటి వాళ్ళవల్ల తెలుస్తుంది. నీ గొంతు కురూపిది. అందుచేత నువ్వందగాడివి కాదు. నీ బుద్ధి మాలిన మాటతీరు వింటే, ఏ ఆడపిల్లా నిన్ను పెళ్ళాడదు. ఆయన సరేనంటే, నేను మీ అన్ననే పెళ్ళాడతాను,'' అన్నది.

అందరూ జ్యోతి మాటలను మెచ్చుకు న్నారు. వీరన్న తండ్రి ఆనందంగా, ''ఎవరైనా నచ్చకపోతే నాలుకను అదుపులో పెట్టుకోలేని వాడే నిజమైన కురూపి!'' అని వీరన్నతో, '''ఏరా, వీరా! జ్యోతి నిన్ను పెళ్ళాడేందుకు ఇష్టపడుతు న్నది. మరి, నీకూ ఇష్టమేనా?'' అని అడిగాడు.

వీరన్న ఇష్టమేనన్నట్టు తల ఊపగానే, జ్యోతి తల్లిదండ్రులూ, వీరన్న తల్లిదండ్రులూ, వాళ్ళను ఆశీర్వదించారు.

ఆ తర్వాత వీరన్నా, జ్యోతీ భార్యాభర్త లుగా అన్యోన్యంగా కలిసిమెలిసి ఎంతోకాలం సుఖంగా జీవించారు.





# మాయాసరోవరం

## 16

[ఆకాశంలో ఎగురుతున్న హంసలరథంలో నుంచి జారిపోయిన మాయాసరోవరేశ్వరుడు, అరణ్యంలో ఒకచోట నరభక్షక జాతివాళ్ళు కాగబెడుతున్న నీటిబానలో వచ్చి పడ్డాడు. అతడు వాళ్ళతో తన వెంట వున్న వాళ్ళను గురించి చెప్పాడు. అందరూ వాళ్ళకోసం అరణ్యంలో వెతుకు తూండగా, అడవి ప్రతిధ్వనించేలా సిద్ధసాధకుడు పెట్టిన కేక వినిపించింది. తరవాత–]

సిద్ధసాధకుడు, ''జై, మహాకాళా!'' అంటూ పెట్టిన కేకకు మాయాసరోవరేశ్వరుడు ఉన్న చోటునే ఆగి, దిక్కులు చూస్తూ, వడవడ వణికి పోవటం చూసి, నరభక్షకుల గణాచారి చాలా ఆశ్చర్యపోయాడు. అతడివెంటవున్న నలుగురు నరభక్షక జాతివాళ్ళూ, చువ్వైన ఈటెలు పైకెత్తి, ఆ కేక వినవచ్చిన వైపుకు వేగంగా బయలు దేరారు.

మాయాసరోవరేశ్వరుడు అంతలోనే తెప్ప రిల్లి, గణాచారితో, ''మీ వాళ్ళను తిరిగి రమ్మని పిలవటం క్షేమం. ఆ కేకవేసినవాడు మహాకాళుడి భక్తుడు. వాళ్ళ మంత్రశక్తుల ముందు, మీ ఈటెలు పూచికపుల్లల సాటి రావు,'' అన్నాడు.

ఆ మాటలకు గణాచారి బిగ్గరగా నవ్వి, ''మా నరభక్షకులకు ఇలాంటి మంత్ర తంత్రాల భయం ఏమీలేదు. మాకు ఆహారం అయ్యేందుకు, అరణ్యదేవర అంతులేని కరుణవల్ల మరొక మనిషి మాకేసి వస్తు న్నాడు,'' అన్నాడు.

గణాచారి మాట ముగించేంతలో, ఈటెలు పైకెత్తి ఉత్సాహంగా ముందుకు పోయిన



సిద్ధసాధకుడు, ''మహాకాళా!'' అంటూ మరోసారి కేకపెట్టి, పారిపోజూస్తున్న నరభక్ష కుల ముందుకు నరవానరంతో వచ్చి నిలబడి, ''కదిలారంటే, మిమ్మల్ని నా నరవానరానికి బలిపెడతాను. ఎవరు మీరు? కాంచనమాల అనే రాజకుమారి హంసలరథం మీది నుంచి ఇక్కడ జారిపడింది. చూశారా?'' అన్నాడు కళ్ళెర్రచేసి.

సిద్ధసాధకుడు అన్నమాటల్లో ఒక్కటీ గణాచారికిగాని, అతడి వెంటవున్న నరభక్ష కులకుగాని అర్థం కాలేదు. గణాచారి చప్పున ఏదో గుర్తుకువచ్చినవాడిలా పక్కకు తల తిప్పి, ఒకచెట్టుకొమ్మల చాటున నిలబడి, పారిపోయే ప్రయత్నంలో వున్న మాయాసరోవరేశ్వరుణ్ణి చూసి, సాధకుడికి చేయెత్తి అతణ్ణి చూపిస్తూ, ''మా అరణ్యదేవర ఆకాశం నుంచి మాకు ఆహారంగా పంపినవాడక్కడున్నాడు. మీరు చెప్పే రాజకుమారి సంగతి వాడికేమైనా తెలుసేమో అడగండి,'' అన్నాడు.

ఆ క్షణం వరకూ సిద్ధసాధకుడు, నరభక్ష కుల్ని పారిపోకుండా చూసే ప్రయత్నంలో వుండి, కొంచెం ఎడంగా చెట్టుచాటున నిలబడిన సరోవరేశ్వరుణ్ణి చూడలేదు. ఇప్పుడతడు చప్పున తలతిప్పి చూసి, ''ఒరే, నెత్తిన డిప్పకిరీటం నువ్వా! నువ్వేనా మాయాసరోవరేశ్వరుడివి? దొంగలా పారిపోవాలని చూస్తున్నావా? జాగ్రత్త, కదిలావో శూలానికి గుచ్చి భూమిలో పాతెయ్యగలను,'' అన్నాడు.

సాధకుడి మాటలు సరోవరేశ్వరుడికి చాలా కోపం తెప్పించినై. అతడు విసురుగా కత్తి పిడిమీద చేయి వేసి, కత్తి దూయబోయిన వాడల్లా తమాయించుకుని, ''నీ వేషభాషలు

నలుగురు నరభక్షకులూ చావుకేకలు పెడుతూ, చెట్లకు అడ్డంపడి పరిగెత్తి, గణాచారి దగ్గిరకు వచ్చి, ''గణాచారయ్యో, మన ప్రాణాలు దక్కవు! ఏనుగంత నరవానరం మీద, యమకింకరుడొకడు కేకలు పెడుతూ ఇటుకేసే వస్తున్నాడు,'' అన్నారు.

ఈసారి మాయాసరోవరేశ్వరుడితో పాటు, గణాచారి కూడా వణికిపోయాడు. అతడికి దూరంగా ఒక చెట్టు ఛాటు నుంచి శూలం పైకెత్తి, నరవానరాన్ని వేగంగా పరిగెత్తిస్తూ, తమను సమీపిస్తున్న సిద్ధసాధకుడు కనిపించాడు.

''ఒరే, ఇక మనం ఇక్కణ్ణించి పారిపోవటం మంచిది. ఒకడు ముందుగా పరిగెత్తిపోయి బెబ్బులిదొరకు, ఈ యమకింకరుణ్ణి గురించి చెప్పండి. వీడి చేతిలో పడ్డామో మనజాతి సర్వనాశనమే!'' అంటూ ముసలి గణాచారి పారిపోయేందుకు వెనుదిరిగాడు.

చూస్తూంటే, నువ్వేదో కాపాలికుడివని తప్ప నీ ఊరూ, పేరూ తెలియటం లేదు. సరిసమానులపైన మాత్రమే నేను కత్తి దూయగలను. ఇక ఇంతట నీ పరుషవాక్యాలు చాలించి, నీ దారిన నువ్వు పో,'' అన్నాడు ఈసడిస్తున్నట్టు.

''నేను సిద్ధసాధకుణ్ణి, మహాకాళుడి భక్తుణ్ణి. నీ అంతస్తుకు తగిన శత్రువు నా బంటుగా వున్నాడు. వాణ్ణి నేనిటు వచ్చేప్పుడు చుట్టుపక్కల రాజకుమారి కాంచనమాల కోసం వెతకమని పంపాను. వాణ్ణిపిలవమంటావా?'' అని, సిద్ధసాధకుడు గొంతెత్తి, ''ఒరే, జలవృకా, ఎక్కడ? మీ జాతి శత్రువైన మాయాసరోవరేశ్వరుడిక్కడున్నాడు. ఈ క్షణమే వచ్చి, వాడి బలదర్పాలేమిటో పరీక్షించు,'' అంటూ కేకపెట్టాడు.

ఆ వెంటనే సాధకుడి బంటయిన జలవృకరాక్షసుడు దూరం నుంచి జవాబుగా ఒక కేకపెట్టి, ముళ్ళపొదల మీదుగా దూకుతూ, జబ్బలు చరుస్తూ, ''ఎక్కడ? ఆ దురాత్ముణ్ణి, నా రాతిగదతో పిండికింద కొడతాను,''అంటూ అరిచాడు.

జలవృక రాక్షసుడు అలా వేగంగా వస్తూన్న సమయంలో ఒక పెద్ద టేకుమాను చాటు నుంచి చప్పున మకరకేతు తన జలగ్రహం మీద ముందుకు వచ్చి, అతడి దారిని అడ్డగించాడు. జలగ్రహం పెద్దగా ఘీంకరించి తొండం సాచి జలవృకరాక్షసుణ్ణి పట్టుకోబోయింది. జలవృకరాక్షసుడు ఒక్కఎగురున పక్కకు పోయి, మెరుపు వేగంతో వెనుదిరిగి, చేతగల రాతిగదతో, జలగ్రహం తలమీద ఒక్క బాదు బాదాడు. ఆ దెబ్బకు జలగ్రహం పక్కకు ఒరిగింది. మకరకేతు భీకరంగా ఒక




కేకపెట్టి, ''ఒరే, జలవృక రాక్షసుడా! నిన్నిదే యమలోకానికి పంపుతున్నాను,'' అంటూ కత్తితో అతడి కంఠం మీద పొడవ బోయాడు. కాని, కత్తి గురితప్పి జలవృకరాక్షసుడి భుజాన్ని చీరింది.

నరవానరం మీద వుండి ఇదంతా చూస్తున్న సిద్ధసాధకుడు, తన బంటు గాయపడగానే ఎక్కడలేని ఆవేశంతో ఒక కేకపెట్టి, ''తరవాత జయశీలుడు ఏమైనా అనుగాక, ముందు ఈ సరోవరంగాణ్ణీ, ఆ నీటి మొసలినీ నా శూలంతో చిత్రవధ చేస్తాను,'' అంటూ నరవానరాన్ని అదిలించాడు.

ఆ మరుక్షణం చుట్టూ చప్పట్లూ, ఈలలూ చెలరేగినై. సిద్ధసాధకుడు ఆశ్చర్యపోతూ తలతిప్పి చూశాడు. ఇప్పుడు ఆ చుట్టుపక్కల వున్న చెట్లవెనకా, పొదల చాటునా చాలామంది నరభక్షకులు చేరారు. వాళ్ళల్లోంచి వాళ్ళ నాయకుడైన బెబ్బులిదొర ఈటె




భుజాన పెట్టుకుని ముందుకు వస్తూ, గణా చారితో, "గణాచారీ! అరణ్యదేవర మనకు ఆహారంగా ఇంతమందిని ఒక్కసారిగా పంప టంఆశ్చర్యంగా లేదా? ఆహా, ఆయన భక్తుల పాలిటి తేనెపట్టుగదా!" అన్నాడు.

బెబ్బులిదొర మాటలూ, అతడి జాతివాళ్ళ యిన నరభక్షకులు లొట్టలు వేస్తూ తమను చుట్టుముట్టేందుకు వస్తూండటం గమనిం చిన సిద్ధసాధకుడు, ఇప్పుడు తన శత్రువులతో పాటు తనకూ ప్రాణాపద రానున్నదని గుర్తించి, ఒక్కదూకున నరవానరాన్ని మకరకేతు దగ్గిరకు పరిగెత్తించాడు.

మకరకేతు గాయపడిన జలగ్రహం తల మీద చేతులతో తట్టి, అది లేచి నిలబడగానే, దాని మీద ఎక్కి కూర్చోబోయినవాడల్లా ఆగి, అంతదూరంలో వున్న మాయాసరోవరేశ్వరు డితో, "సరోవరేశ్వరా, దయచేసి ఈ జలగ్రహాన్ని అధిష్ఠించండి. ఈ సిద్ధసాధకుడు దురావేశ పరుడేగాని, మంచివాడు. ఇతడి మిత్రుడైన జయశీలుడు మనందరికీ మిత్రుడు. వైద్య దేవుడూ, అతడూ కలిసి హంసలరథంలో త్వరలోనే ఇక్కడికి రానున్నారు," అన్నాడు.

నది ఒడ్డున జరిగిన సంగతులేవీ తెలియని మాయాసరోవరేశ్వరుడికి, మకరకేతు మాటలే మాత్రం అర్థం కాలేదు. అయినా జలగ్రహం మీద వుండటం తనకు రక్షణగా వుంటుందని అతడు అడుగులో అడుగు వేసుకుంటూ దాన్ని సమీపించాడు. ఈ లోపల మకరకేతు వల్ల కత్తిదెబ్బ తిని బాధతో కిందపడిపోయిన జలవృకరాక్షసుడు మూలుగుతూ చెట్టు బోదెనొకదాన్ని పట్టుకుని లేచి నిలబడి, సిద్ధ సాధకుడు కంటబడగానే, "దొరా, ఏమిటి సెలవు?" అన్నాడు.

"నీకు తగిలిన గాయం అంత ప్రమాద కరమైనది కాదనుకుంటాను. ముందు నీ రాతిగదను చేతికి తీసుకో," అని సిద్ధసాధ కుడు మకరకేతును, "ఇప్పుడు ఎవరి నుంచి ఎవరికి ప్రమాదం రాబోతున్నదో గమనించావా?" అని అడిగాడు.

"ఈ నరభక్షకులు అరణ్యదేవర మనను, తమకు ఆహారంగా పంపాడని భ్రమపడు తున్నట్టున్నది. ముందు ఈ క్రూరుల నుంచి మనం మనను కాపాడుకోవాలి," అన్నాడు మకరకేతు కత్తిపిడి గట్టిగా గుప్పెట బిగించి పట్టుకుంటూ.

"కేతూ, నీ తెలివికి మెచ్చాను. రాజు కనకా క్షుడి పిల్లలను వెతికి రక్షించి, ఆయనకు ఒప్పచెప్పకుండా నేనుగాని, జయశీలుడు గాని ఏ నరభక్షకులకూ ఆహారం అయిపో దలచలేదు. ఈ అనాగరికులకు ముందు

మంచిగా చెప్పి చూస్తాను. వినకపొయ్యారో, అందరినీ - ఆడవాళ్ళనూ, పిల్లలనూ వదిలి - ఊచకోత కోద్దాం,'' అన్నాడు సాధకుడు.

నరభక్షకుల గణాచారి అప్పటివరకూ పూనకం వచ్చిన వాడిలా కళ్ళు మూసుకుని అటూ ఇటూ ఊగుతున్నవాడల్లా, చప్పున ఎగిరి ఒక గంతేసి, ''అరణ్యదేవరో!'' అంటూ ఒక కేకపెట్టి, ''ఆకలి! ఆకలి! ఒరే, అరణ్య దేవర ఆహారంగా పంపిన మనుషుల్లారా, అలా చూస్తారేం? కదలండి, అరణ్యదేవర ఆలయానికి. అక్కడ ముందుగా మిమ్మల్ని నైవేద్యం పెట్టి, తరవాత తినేస్తాం,'' అన్నాడు.

సిద్ధసాధకుడు తొణక్కుండా శూలం ఎత్తి పట్టుకుని, ''ఒరే, నరమాంస భక్షకులారా, మీరు పొరబడుతున్నారు. మేం ఎవరిచేతా మీకు ఆహారంగా పంపబడ్డవాళ్ళం కాదు. హంసలరథం మీదినుంచి జారి అరణ్యంలో పడిన మా వాళ్ళకోసం వెతుకుతూ ఇటు వచ్చాం. ఆ పడినవాళ్ళలో మాయాసరోవరే శ్వరుడనేవాడు మాకు దొరికాడు. ఇక మా దారిన మేం పోతాం. మీరు కూడా మంచిగా, బుద్ధిగా మీ దారిన మీరు పొండి,'' అన్నాడు.

''మా ఆకలి మాటేమిటి? వారాల తరబడి మేం తినేందుకేందొరక్క ఉపవాసాలు చేస్తు న్నాం,'' అన్నాడు బెబ్బులిదొర ఈటెను ఝళి పిస్తూ, సిద్ధసాధకుడి ముందుకు వచ్చి.

''నువ్వు,మాయాసరోవరేశ్వరుడనేమనిషిని, మా అరణ్యదేవర ఆకాశం నుంచి సూటిగా మేం మాంసం ఉడకబెట్టే బానలోకి దించాడు. ఆ మాట అబద్ధమా?'' అంటూ గణాచారి చిందులు ప్రారంభించాడు.

సిద్ధసాధకుడుహెచ్చరించగానే నరవానరం, బెబ్బులిదొరను రెండు చేతులతో ఒడిసి పట్టుకుని పైకెత్తింది. మాయాసరోవరేశ్వ



రుడెక్కివున్న జలగ్రహం ఒక్క దూకున ముందుకు వచ్చి తొండం సాచి, గణాచారిని నడుం దగ్గిర పట్టుకుని గాలిలో గిరగిరా తిప్పసాగింది. బెబ్బులిదొరా, గణాచారీ చావు కేకలు పెడుతూనే మధ్య మధ్య, "మన ఆహారం అయిన ఈ మనుషుల్ని వదలకండి, ఈటెలతో పొడవండి!" అంటూ అరవసాగారు.

"చూస్తావేం, జలవృకభటా! ఈ నరభక్షకుల్ని నీ రాతిగదతో పిండికింద కొట్టు," అంటూ సిద్ధసాధకుడు జలవృకరాక్షసుణ్ణి హెచ్చరించాడు.

"సిద్ధసాధక దొరకూ, జై!" అంటూ జలవృకరాక్షసుడు రాతిగద ఎత్తి, నరభక్షకుల మీదికి విరుచుకుపడ్డాడు. ఆకలితో ప్రాణాలకు తెగించిన నరభక్షకులు వాణ్ణి ఎదిరించారు. జలవృకరాక్షసుడు గదతో అందిన వాళ్ళను అందినట్టు ఎడాపెడా కొడుతూండగా, నరభక్షకులు వాణ్ణి ఈటెలతో పొడిచేందుకు ప్రయత్నిస్తూ, తమ కేకలూ, అరుపులతో ఆ అరణ్యప్రాంతమంతా ప్రతిధ్వనించేలా చేయసాగారు. సిద్ధసాధకుడు కొంచెంసేపు తన జలవృకభటుడు పోరాడుతున్న తీరుచూసి, "భేష్, జలవృకభటా! నీవు పౌరుషశాలివి, ధైర్యవంతుడివి! నీకు సాయం వస్తున్నాను," అంటూ కేకపెట్టి, నరవానరం చేతుల్లో వున్న బెబ్బులి దొరను దూరంగా విసిరి వేయించి, "జై, మహాకాళా!" అంటూ శూలం ఎత్తి, నరభక్షకులమీదికి నరవానరాన్ని ఉరికించాడు.

ఆ మరుక్షణం పదిమంది ఆశ్వికులు వేగంగా అక్కడికొస్తూ, "ఆగండి! ఆగండి! ఇది హిరణ్యపురం రాజైన కనకాక్షమహారాజు గారిఆజ్ఞ!" అంటూ అరిచారు.

ఆశ్వికుల హెచ్చరిక వింటూనే సిద్ధసాధకుడూ, నరభక్షకులూ పోరాటం మాని ఆశ్చర్యంగా వాళ్ళకేసి చూడసాగారు. మాయాసరోవరేశ్వరుడు వణికిపోతూ, "మకరకేతూ! మనం వేగంగా మాయాసరోవరాన్ని చేరటం క్షేమం గదా?" అన్నాడు.

ఆ మాటలు విన్న సిద్ధసాధకుడు కోపంతో కళ్ళెర్రచేసి, "ఒరే, దుష్ట సరోవరేశ్వరా! నువ్వు ఎక్కడికీ పారిపోలేవు. నువ్వు క్షేమం అనుకునేది, కీడుగా పరిణమించబోతున్నది, జాగ్రత్త!" అంటూ శూలాన్ని అతడి గుండెలకు ఆనించాడు. —(ఇంకావుంది)



బేతాళ కథలు

# బూటకయ్య పండిత సభలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎన్నో గొప్ప వైభవాలకు అలవాటుపడిన నువ్వు, అర్ధరాత్రివేళ శ్మశానంలో, శవాన్ని మోసే హేయమైన పనిని ఎలా ఇంత దీక్షగా చేస్తున్నావో, నాకు ఏమాత్రం అర్థం కావడంలేదు. ఒకవేళ ఈ కఠోరదీక్షకు ప్రేరణ, ఎవరైనా ప్రత్యర్థి అయితే మాత్రం, నువ్వు యుక్తాయుక్తాల గురించి అప్రమత్తంగా వుండడం మేలనిపించుకుంటుంది. ఎందుకంటే, వీరాంగుడనే మహాపండితుడొకడు, ఒకానొక బూటకపు పండి

తుడితో పోటీపడి అగౌరవానికి గురయ్యాడు. నీకా పండితుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

శోచవరం గ్రామాధికారి బూటకయ్యకు మహాపండితుడిననిపించుకోవాలని కోరిక. అందుకని ఆయన ప్రతిరోజూ తన గ్రామంలో సభచేసి పురాణ విశేషాలూ, వేదాంతవ్యాఖ్యలూ చెప్పేవాడు. గ్రామస్థులు ఆయన్ను సందేహాలడుగుతూండడమూ, వాటికాయన సమాధానాలిస్తూండడమూ కూడా, ఆ సభలలో ముఖ్యాంశంగా కొనసాగేది.

ఒక రోజున ఆ గ్రామానికి ఏదో పనిమీద మాధన్న అనే యువకుడు వచ్చాడు. సాయంత్రం సభ జరుగుతూంటే, అతడూ అందులో పాల్గొన్నాడు. ఆ రోజున బూటకయ్య గ్రామస్థులకు గజేంద్రమోక్షం కథ చెప్పాడు. కథ పూర్తయ్యాక, గ్రామస్థుడొకడు లేచి నిలబడి, ''అయిదుగురు భర్తలున్న ద్రౌపది పతివ్రత ఎలాగైంది?'' అని అడిగాడు.

బూటకయ్య నవ్వి, ''నీ ప్రశ్నలోనే సమాధానముంది,'' అన్నాడు. ఇంకొక గ్రామస్థుడు, ''సీతను అడవుల్లో విడిచిపెట్టిన రాముడు ఆదర్శపతి ఎలాగయ్యాడు?'' అన్నాడు. ''ఆ మాట సీత అన్నది కాబట్టి, ఈ ప్రశ్న సీతనే అడగాలి,'' అన్నాడు బూటకయ్య సమాధానంగా.

మరొక గ్రామస్థుడు, ''శివుడు నాట్యాన్ని సృష్టిస్తే, అది మగవాళ్ళకంటే ఆడవాళ్ళే ఎక్కువ అభ్యసిస్తున్నారేం?'' అని అడిగితే, ''అదే సృష్టి ధర్మం! సంపాదన పురుషుడిది, వ్యయం ఆడవాళ్ళది,'' అన్నాడు బూటకయ్య.

ఇలాగే ఎందరో ఎన్నో ప్రశ్నలడిగారు, ఒక్కరూ గజేంద్రమోక్షానికి సంబంధించిన



ప్రశ్నలడగలేదని మాదన్న ఆశ్చర్యపడ్డాడు. అంతేకాదు, బూటకయ్య ఇచ్చిన సమాధానాలేమీ సూటిగానూ లేవు, తెలివిగానూ అనిపించడం లేదు. అయినా గ్రామస్థులందరూ, ఆయన సమాధానాలకు ఎంతో సంతోషించినట్టు కనబడ్డారు.

మాదన్నకు, వీరాంగుడనే మహాపండితుడొకడు దూరపుబంధువు. వీరాంగుడు, బూటకయ్య కంటే గొప్పగా కథలు చెప్పగలడు. సభికుల సందేహాలకు తెలివిని పెంచే సమాధానాలివ్వగలడు.

శోచవరం గ్రామస్థులకు పండిత గోష్ఠి అంటే చాలా ఇష్టం కాబట్టి, వారికి వీరాంగుడి పాండిత్యం ఎంతో సంతోషాన్నిస్తుందని, మాదన్న అనుకున్నాడు. ఆ విషయం బూటకయ్యకు చెప్పి, "అయ్యా! తమ పండితసభలు గొప్పగా వున్నాయి. మీరొప్పుకుంటే, నాకు తెలిసిన వీరాంగుడనే పండితుణ్ణి ఈ గ్రామానికి రప్పించగలను," అన్నాడు.

"పండితుడు గొప్పవాడైతేనే పండిత సభలు రాణిస్తాయి. మరి వీరాంగుడు కూడా, నా అంత గొప్ప పండితుడేనా?" అని అడిగాడు బూటకయ్య.

"అది నేను చెప్పలేను. కానీ ఆయన ఒకసారి రాజసత్కారాన్ని పొందాడని, నాకు తెలుసు," అన్నాడు మాదన్న - వీరాంగుడు, బూటకయ్య కంటే గొప్ప పండితుడని చెప్పడానికి మొహమాటపడి.

"రాజసత్కారానికి పాండిత్యం కంటే, రాజాస్థానంలో పలుకుబడిగలవాళ్ళ ప్రాపకం ముఖ్యం. అయినా, పండితుల అసలు సత్తా ఇలాంటి సభల్లోనే తేలుతుంది. వీరాంగుణ్ణి




తప్పకుండా రప్పించు," అన్నాడు బూటకయ్య ఎంతో ధీమాగా.

మాదన్న తన ఊరు వెళ్ళాక, ఈ విషయమై వీరాంగుడికి కబురు పంపాడు. అందుకు వీరాంగుడు, "ఈ చుట్టుపక్కల గ్రామాల్లో పండిత సభలపట్ల ఆసక్తిగలవారున్నారంటే చిత్రంగావుంది. నేను తప్పక శోచవరం వస్తాను," అని బదులిచ్చాడు.

తర్వాత కొన్నాళ్ళకు మాదన్న, వీరాంగుడు కలిసి శోచవరం వెళ్ళారు. ఏర్పాటుచేసిన పండిత సభలో వీరాంగుడు గజేంద్రమోక్షం కథను అత్యంత రసవత్తరంగా చెప్పాడు. బూటకయ్య కథకూ, ఈ కథకూ వున్న తేడా మాదన్నకు స్పష్టంగా తెలిసింది. అయితే, గ్రామస్థుల్లో ఒక్కరు కూడా లేచి ప్రశ్నలు అడగలేదు.

"అంటే, సభికుల్లో చిన్న అనుమానానికి కూడా ఆస్కారం లేనంత స్పష్టంగా వీరాంగుడు



కథను చెప్పివుండాలి,'' అన్నాడు మాదన్న, బూటకయ్యతో.

''అదేం కాదు. నేను చెబితే గ్రామస్థులకు అంతా అరటిపండు వలిచినట్టు అర్థమవుతుంది. అలా అర్థమైనప్పుడే ఎవరికైనా సందేహాలూ పుట్టుకొస్తాయి. ఇప్పుడు నేను వీళ్ళకు రుక్మిణీకళ్యాణం కథను వినిపిస్తాను. ఎన్నిఅనుమానాలడుగుతారో నువ్వేచూడు!'' అంటూ బూటకయ్య గ్రామస్థులకు రుక్మిణీ కళ్యాణం కథ చెప్పాడు. చాలామంది గ్రామస్థులు ఒకరి తర్వాత ఒకరుగా ఆయన్ను ఎన్నో సందేహాలడిగారు. అవన్నీ కూడా ఋష్యశృంగుడి కథకు సంబంధించినవి. బూటకయ్య ఇచ్చిన సమాధానాలు కూడా, పూర్వంలాగే అర్థవిహీనంగా వున్నాయి.

ఇది చూసి వీరాంగుడు ఆశ్చర్యపడి, ''రుక్మిణి కథ విని ఋష్యశృంగుడి గురించిన ప్రశ్నలు వేయడం విడ్డూరంగా వుంది. గతంలో కూడా గజేంద్రమోక్షం కథ విని, రామాయణం, మహాభారతాల్లో సందేహాలడిగారని చెప్పావు! ఈ గ్రామస్థులూ, బూటకయ్య కూడా గొప్ప వేదాంతులైనా అయివుండాలి, పరమ మూర్ఖులైనా అయివుండాలి. ఈ విషయం తేలాలంటే పండిత సభలు ఈ గ్రామంలోకాక ఇతర ప్రాంతాల్లో జరగాలి,'' అన్నాడు మాదన్నతో.

మాదన్న అసలు విషయం చెప్పకుండా బూటకయ్య పాండిత్య ప్రతిభను పొగిడి ఉబ్బేసి, నామవరంలో పండితసభకు బూటకయ్య వచ్చేలాగా ఒప్పించాడు.

నామవరం, శోచవరానికి దగ్గర్లోని గ్రామమే. అక్కడ పండితసభ ఏర్పాటు చేస్తే జనం బాగానే వచ్చారు. వీరాంగుడు, కుంతీదేవి కథ చెబితే, అంతా మౌనంగా విని ఊరుకున్నారు. కానీ బూటకయ్య, ప్రహ్లాదుడి కథ చెప్పగానే సభికుల్లో చాలామంది, వామనావతారం గురించి ప్రశ్నలు వేశారు. వాటికి గతంలోలాగే బూటకయ్య తప్పించుకునే సమాధానాలిచ్చాడు.

ఇది వీరాంగుడికి మరింత చిత్రమనిపించింది. ఆ తర్వాతాయన బూటకయ్యతో పోటీపడి, నిశాపురంలోనూ పండితసభను నిర్వహిస్తే, అక్కడా ఇలాగే జరిగింది. తన ప్రసంగం సభికుల్లో ఏవిధమైన ఉత్సాహం కలిగించనందుకు వీరాంగుడు నీరసపడి, చివరి ప్రయత్నంగా జాగృతిపురంలో పండిత సభ నిర్వహించాలనుకున్నాడు.

జాగృతిపురంలో గతంలో వీరాంగుడికి ఘన సన్మానం జరిగింది. అక్కడి ప్రజలైనా తనను బూటకయ్య ముందు తలెత్తుకునేలా చేయగలరన్న ఆశతో వీరాంగుడు, మాదన్నను జాగృతిపురం వెళ్ళి ఏర్పాట్లు చూడమన్నాడు. మాదన్న

జాగృతిపురం వెళితే, అక్కడి గ్రామాధికారి ఆగ్రహంతో, "ఇప్పటికే మావాళ్ళు వీరాంగుడికి సన్మానం చేసినందుకు నొచ్చుకుంటున్నారు. ఇకఆయనకు మా గ్రామంలో అడుగుపెట్టడం మంచిదికాదు," అన్నాడు.

"అయ్యా! వీరాంగుడి విషయంలో తమరు పొరబడ్డారు. బూటకయ్యతో ఓడిపోయాడనే కదా మీరాయన్నేవగించుకుంటున్నారు. అది ఆ పండితసభలు నిర్వహించిన గ్రామాలలోని పౌరుల అజ్ఞానం. వారి అజ్ఞానాన్ని ఆసరాగా చేసుకుని, బూటకయ్య మిడిసిపడిపోతున్నాడు. ఆ మిడిసిపాటును తగ్గించగల సమర్థత జాగృతిపురం పౌరులకే వుంది. అందుకే ఇక్కడ వీరాంగుడికీ, బూటకయ్యకూ పోటీ ఏర్పాటు చేద్దామనుకుంటున్నాను," అన్నాడు మాదన్న.

గ్రామాధికారి చిరాగ్గా, "మళ్ళీ అదేమాట చెబుతారేమిటీ! ఆ బూటకయ్యకు ఏమాత్రం పాండిత్యం లేదని మా అందరికీ తెలుసు. వాడికి పండితుడిననిపించుకోవాలని పెద్ద దురాశ. అందుకే పండిత సభలు నిర్వహిస్తూంటాడు. వాడు గ్రామాధికారి కాబట్టి, తన అధికార బలంతో తనకిష్టులైనవారికి ఎంతో సాయపడ గలడు. ఇష్టంలేనివారిని ఎంతైనా ఇబ్బంది పెట్ట గలడు. అందువల్లనే వాడితో మంచిగా వుండాలని అంతా అనుకుంటారు. మంచిగా వుండాలనుకునేవారందరూ, వాడి పండిత సభలకు వెళతారు. వాడెక్కడ ఏ ఊళ్ళో పండితసభలు పెట్టినా వాడితోపాటు వాళ్ళూ వెళతారు. సభలో చాలామందే ఉంటారు గదా-అందరి మధ్యనా తాము ఉన్నట్లు బూటకయ్యకు తెలియడం కోసమే, వాళ్ళు వాణ్ణి ప్రశ్నలు వేస్తారు. అదీ బూటకయ్య పండితసభల మర్మం!" అన్నాడు.

ఈ వివరాలు మాదన్నకు చాలా ఆశ్చర్యం కలిగించాయి. అతడు గ్రామాధికారిని, "అయ్యా!



అంతవరకూ బాగానేవుంది. కానీ వాళ్ళు బూట కయ్య చెప్పిన కథలోంచి కాక, ఇంకేవేవో ప్రశ్న లడుగుతారెందుకు?'' అని అడిగాడు.

గ్రామాధికారి విసుగుపడుతూ, ''బూట కయ్య కథలు వినడం, ఆ గ్రామస్థులకు తలనొప్పి. అందుకని వాళ్ళు మనసును వేరే కథల మీద లగ్నం చేసి ఆలోచించుకుంటూ కూర్చుంటారు. బూటకయ్య మాట్లాడడం అయ్యాక, తమకు తోచిన ప్రశ్నలడుగుతారు. జవాబులు బూటకయ్యకూ తెలియవు; గ్రామస్థులకూ జవాబులక్కర్లేదు. ఆ కారణంగా ఆయనజవాబులన్నిటినీ మెచ్చేసుకుంటారు,'' అని వివరించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, జాగృతి పురం గ్రామాధికారికి బూటకయ్యను గురించి క్షుణ్ణంగా తెలుసు. తాను పండితుడనిపించు కునేందుకు, అతడాడుతున్న కపటనాటకం ఏమిటో, మాధన్నకు అంతా వివరించాడు. ఐనా, అతడు వీరాంగుణ్ణి తనగ్రామంలో అడుగు పెట్టవద్దనడం, ఆ మహాపండితుడిని అవమా నించడమే అవుతుందిగదా? గతంలో వీరాంగుడి పట్ల ఎంతో గౌరవభావంగల గ్రామాధికారి, ఇలా ఈసడించడానికి కారణం ఏమిటి? ఈ సందేహా లకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''జాగృతిపురం గ్రామాధికారికి, మహాపండితుడైన వీరాంగుడి పట్ల వున్న గౌరవాభిమానాల కారణంగానే, ఆయన్ని తమ గ్రామంలో అడుగుపెట్టడం మంచిదికాదన్నాడు. ఇందుకు ప్రబలమైన కారణం వుంది. వీరాంగుడు పండితుడేగాని, ఆయనలో లోకం తీరూ, కుపండితుల కుతం త్రాలూ అవగాహన చేసుకోగల లౌకిక, తార్కిక జ్ఞానం కొరవడింది. ఆ కారణం వల్లనే ఆయన, ఒకటికి రెండుసార్లు బూటకయ్యతో పోటీకి దిగడం జరిగింది. ఇది గ్రహించిన గ్రామాధికారి, వీరాంగుడి పాండిత్య ప్రతిభకు మచ్చ అంట కుండా వుండేందుకు, ఆయనను బూటక య్యతో పోటీ పడేందుకు తమ గ్రామం రావద్ద న్నాడు. ఇందులో గ్రామాధికారి, వీరాంగుణ్ణి ఈసడించడంగానీ, అవమానించడంగానీ ఏమీలేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: ''వసుంధర'' రచన]






# 'సోలా' తో మృదువైన బొమ్మలు

మెత్తటి బొమ్మలు తయారుచేయడం మన దేశానికి కొత్త అనుకుంటున్నారా? కాదు. పిల్లలు ఆడుకునే మృదువైన బొమ్మలను మనదేశంలో కొన్ని శతాబ్దాల నుంచి తయారు చేస్తున్నారు. అయితే, అవి ఇవాళ మార్కెట్లో లభిస్తూన్న టెడ్డీ, బన్నీ టైపు సింథటిక్ బొమ్మలు కావు.

ఈ పాతబొమ్మలు కొన్నిరకాల మొక్కల పీచుతో తయారుచేస్తారు. ఇవి చాలా తేలికైనవి. అంతేకాదు; అందుబాటులో ఉన్న ధరలకు ఇవి లభిస్తున్నాయి.

చిత్తడినేలల్లో పెరిగే ఒకరకం రెల్లు 'సోలా'. ఇది పశ్చిమబెంగాల్లో విరివిగా లభిస్తుంది. బెంగాల్‌కళాకారులు దీనిని రకరకాల బొమ్మలు తయారుచేయడానికి ఉపయోగిస్తారు.

గట్టిగా ఉన్న వెలుపలి ఊదారంగు పలుచటి పొరను తొలగించినట్టయితే, దంతరంగు మెత్తటిభాగం బయట పడుతుంది. వీటిని కత్తిరించి, బొమ్మలు తయారుచేయడానికీ, బొమ్మలను అలంకరించడానికీ, ఇతర అలంకరణలకూ ఉపయోగిస్తారు. ఇప్పుడు వీటితో తయారైన బొమ్మలకు రకరకాల రంగులు వేస్తున్నారు.

బ్రిటిష్‌వాళ్ళ కాలంలో సోలా రెల్లుతో టోపీలు తయారుచేసేవారు. ఎండదెబ్బను తప్పించుకోవడానికి ఆంగ్లేయులు ఈ టోపీలను పెట్టుకునేవారు.

బెంగాల్లో దుర్గాపూజ సమయంలో దుర్గామాత విగ్రహాలను అలంకరించడానికి ఈ సోలాను ఉపయోగిస్తారు. ఇది చాలా ఆకర్షణీయంగా ఉంటుంది.

పెళ్ళి సమయంలో బెంగాలీ హిందూ పెళ్ళికొడుకులు ధరించే 'టోపార్' అనే తలపాగాలూ, పెళ్ళికూతుళ్ళు ధరించే 'ముకుట్' అనే కిరీటాలూ ఈ సోలా రెల్లుతో తయారుచేసేవే.





# అప్పివ్వనివాడు

శివపురానికి కొత్తగా వచ్చాడు ఆనందుడు. ఆ ఊళ్ళో నాలుగెకరాల పొలం కొన్నాడు. పది పాడి ఆవుల్ని కొన్నాడు. వ్యవసాయం, పాల వ్యాపారంచేసుకుంటూ, ఆ ఊళ్ళో సుఖంగా రోజులు వెళ్ళబుచ్చాలని, ఆయన అనుకున్నాడు. ఊళ్ళోకి వచ్చిన వేళావిశేషమో ఏమో, అనుకోకుండా ఆయన కూతురుకు చక్కటి పెళ్ళి సంబంధం కుదిరింది. వెంటనే ముహూర్తం పెట్టి పెళ్ళి జరిపించమని మగపెళ్ళివారన్నారు.

"ఒక ఏడాది తర్వాతైతే అమ్మాయి పెళ్ళికి డబ్బుకు తడుముకునేవాణ్ణి కాదు. ఇప్పటి కిప్పుడు పెళ్ళి అంటే మనదగ్గరవున్న డబ్బు చాలదు. కనీసం రెండువందల వరహాలైనా అప్పు చేయాలి. ఊరేమో కొత్త. మనకు అప్పెవరిస్తారు?" అని ఆనందుడు, భార్య రాజేశ్వరి దగ్గర దిగులుపడ్డాడు.

రాజేశ్వరి చుట్టుపక్కల విచారించి, "ఈ ఊళ్ళో, ఇద్దరు వడ్డీవ్యాపారులున్నారు. ఒకాయన పొలమయ్య. ఆయన పొలం తాకట్టు పెట్టుకుని అప్పిస్తాట్ట. ఇంకొకరు బంగారయ్య. ఆయన బంగారం తాకట్టు పెట్టుకుని అప్పిస్తాట్ట," అని భర్తకు చెప్పింది.

రెండు వందల వరహాలు చిన్న మొత్తం కాబట్టి, మాట నమ్మకం మీద స్నేహభావంతో అప్పిచ్చేవాళ్ళుంటే బాగుండునని ఆయన అనుకున్నాడు. కొత్తగా కొన్న పొలం తాకట్టు పెట్టడం ఇష్టంలేదు. ఆడవాళ్ళు నగలు ధరించేది పెళ్ళివంటి వేడుకలలోనే కాబట్టి, బంగారం తాకట్టు పెట్టడమూ కుదరదు. ఏ తాకట్టూ లేకుండా, వడ్డీ ఎంత అడిగినా ఇవ్వడానికి కూడా ఆనందుడు సిద్ధంగా ఉన్నాడు.

ఆనందుడి సమస్య విని పొరిగింటి వీరయ్య, "ఈ ఊళ్ళో తాకట్టు లేకుండా అప్పిచ్చేవాళ్ళు లేరు. అయితే, పొరుగూళ్ళో ధనయ్య ముక్కూ ముఖం తెలియని వాళ్ళక్కూడా అప్పిస్తాడు. నీకు రెండు వందల వరహాలు కావాలంటే, ఆర్నెల్ల తర్వాత నాలుగొందలవరహాలు ఇచ్చుకోవాలి. నీకిష్టమైతే వెళ్ళి ఆయన్ను కలుసుకోవచ్చు," అని సలహా ఇచ్చాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

ఏం చేయాలా అని ఆనందుడు ఆలోచి స్తుండగా, అక్కడికి ఒక ముప్పై సంవత్సరాల యువకుడు వచ్చాడు. తెల్లని మల్లెపువ్వు ల్లాంటి బట్టలు ధరించాడు. బంగారు ఛాయలో మిసమిసలాడిపోతున్నాడు. అతడు వీర య్యను పలకరించి, ''ఏమిటి వీరయ్య గారూ, వారం రోజుల్లో ఇస్తానని తీసుకున్న నూరువరహాలూ, రెండు నెలలైనా ఇంకా తీర్చ లేదనా, నాకు కనబడకుండా మొహం చాటే స్తున్నారు. నేనేమైనా మిమ్మల్ని నిలదీశానా? మా ఇంటికి మామూలుగా వస్తూ పోతూం డండి'' అని వెళ్ళిపోయాడు.

''అతడెవరు?'' అనడిగాడు ఆనందుడు కుతూహలంగా.

''అతడిపేరు మల్లినాధుడు. మనిషి చాలా మంచివాడు. గొప్ప ఆస్తిపరుడు. అవసరంలో వున్నవారికి ఎంతైనా ఇచ్చి ఆదుకునే ఉపకార గుణమున్నవాడు. ఎట్టిపరిస్థితుల్లోనూ ఇచ్చిన డబ్బుకు వడ్డీ అడగడు,'' అంటూ వీరయ్య, ఆ యువకుడి గురించి చెప్పాడు.

''అయ్యో! నాకు అతణ్ణి పరిచయం చేయాల్సింది,'' అన్నాడు ఆనందుడు వెంటనే.

వీరయ్య కాస్త సంకోచిస్తూ, ''చేసేవాణ్ణే. కానీ మల్లినాధుడు అదోతరహా మనిషి. మాయామర్మం తెలియదు. మనసులో ఏముంటే, ఆ మాట పైకి అనేస్తాడు. పాత వాళ్ళం ఏదో సర్దుకుపోతూంటాం. కానీ కొత్త వాళ్ళకు కాస్త ఇబ్బందిగానే ఉంటుంది, అతడి ప్రవర్తన. అతడు అందరికీ అప్పివ్వడు. అయితే, ఇచ్చినా ఇవ్వకపోయినా అతడితో ఇబ్బందే! బాగా తెలిసిన మేము కూడా అతడివద్ద అప్పు తీసుకోవాలంటే సంకోచిస్తాం,'' అన్నాడు.



''అప్పిస్తే అన్నమాట ప్రకారం బాకీ తీర్చే స్తాను కాబట్టి ఏ ఇబ్బందీ ఉండదు. అప్పివ్వక పోతే ఇబ్బంది ఏముంటుంది?'' అన్నాడు ఆనందుడు ఆశ్చర్యంగా.

''అది అనుభవిస్తే తప్ప అర్థంకాదు! చెబితే ఏం తెలుస్తుంది,'' అని తప్పుకున్నాడు వీరయ్య. ఆనందుడికి వీరయ్య మాటల్లో నమ్మకం కుదరలేదు. ఆయన మల్లినాధుణ్ణి సాయం కోరాలనే నిర్ణయించుకుని, ఆ సాయంత్రం అతడింటికి వెళ్ళాడు.

ఆ సమయానికి మల్లినాధుడు, తండ్రి ఇంటి అరుగుమీద కూర్చుని దేనికో గొడవ పడుతున్నారు.

''మీరు ఆవును కొనమని మరీ మరీ చెప్పారు. అదీ నేను సలహా అడిగితేనే చెప్పారు. మీరు నా ఇష్టప్రకారమే చేయమని చెప్పినా, నేను మీ ఇష్టప్రకారమే చేస్తానని మాటిచ్చాను.



ఇంతా జరిగాక నేను గేదెను కొన్నాను. నా నిర్ణయం సరైనదేనని ఇప్పటికీ నా నమ్మకం. కానీ మీ మనసు కష్టపెట్టినందుకు, నాకు చాలా బాధగా వుంది. ఎంత సరిపెట్టుకుందా మన్నా, నా బాధ తగ్గడం లేదు,'' అంటున్నాడు మల్లినాధుడు.

''నాయనా! అడిగావని సలహా ఇచ్చాను. నాకు నీ వివేకం మీద నమ్మకముంది. నువ్వేం చేసినా నాకు సంతోషమే. అనవసరంగా బాధపడకు,'' అంటున్నాడు తండ్రి.

ఇది విన్న ఆనందుడు, ''మల్లినాధుడి మనసు చాలా సున్నితమైనది. ఇంత మంచి వాడి గురించి, వీరయ్య అలా చెప్పాడేమిటో!'' అనుకున్నాడు.

ఈలోగా మల్లినాధుడు, ఆనందుణ్ణి చూసి సంభాషణ ఆపి, అతడికేసి ప్రశ్నార్థకంగా చూశాడు. ఆనందుడు తనను తాను పరిచయంచేసుకున్నాడు.

''మీ పేరు విన్నాను. ఈరోజు ఉదయం మిమ్మల్ని వీరయ్యగారి పక్కన చూశాను. కొత్త వారిని నాకైనేనుగా పరిచయం చేసుకునే చొరవ లేదు నాకు. అప్పుడు పలకరించనందుకు ఏమీ అనుకోకండి,'' అన్నాడు మల్లినాధుడు.

''ఇందులో అనుకోవడానికేముందీ! నేనూ మీకులాంటివాణ్ణే. ఎటొచ్చీ అవసరంకొద్దీ నాకు నేనుగా మిమ్మల్ని పరిచయం చేసుకోవలసి వచ్చింది,'' అంటూ ఆనందుడు తన అవసరం గురించి చెప్పి, మల్లినాధుడి సాయం కోరాడు.

మల్లినాధుడు వెంటనే, ''ఇంత వెంటనే చెబుతున్నందుకు ఏమీ అనుకోవద్దు. నేను బాగా ఆలోచించి కొన్ని నియమాలు పెట్టుకు న్నాను. ఆ ప్రకారం కొత్తవారితో పరిచయం అప్పుతో ప్రారంభం కాకూడదు. మీ అవసరం న్యాయమైనది. ఒక పెళ్ళికి సాయపడితే నాకు పుణ్యంకూడాను.అయినా, మీకు సాయపడలేక పోతున్నందుకు చాలాబాధగావుంది,'' అన్నాడు.

ఆనందుడు చిన్నబుచ్చుకుని తిరిగి ఇంటికి వెళ్ళిపోయాడు. ఇల్లు చేరుకునే సరికి ఆయన అన్న వినోదుడు వచ్చి వున్నాడు. ఆయన తమ్ముణ్ణి చూస్తూనే, ''అమ్మాయి పెళ్ళికి డబ్బు తక్కువైందటగా. ఈ మధ్య నా పరిస్థితి బాగా మెరుగైంది. ఆదాయం పెరిగింది. నీకు సాయంగా ఒకవెయ్యి వరహాలిచ్చి వెళదా మని వచ్చాను. నీ దగ్గర డబ్బున్నప్పుడు తిరిగి ఇద్దువుగాని,'' అన్నాడు.

తన సమస్య తీరిపోయినందుకు ఆనందుడు ఎంతో సంతోషించాడు. వెంటనే అన్నగారి పాదాలకు దణ్ణంపెట్టి గుడికి బయల్దేరాడు.

గుడిదగ్గర ఆయనకు మల్లినాధుడు ఎదురై, "మీరూ దేవుడి దగ్గరకే వచ్చారా, అయినా ఎందుకు రారులెండి! నేను మీకు అప్పివ్వలేక పోయినందుకే ఎంతో బాధపడుతున్నాను. ఇవ్వ నన్నానందుకు మీరెంత బాధపడతారో అర్థం చేసుకోలేనా? అందులోనూ దగ్గర డబ్బున్నా కూడా నియమానికి కట్టుబడి, మీకివ్వనన్నాను. నాకు చాలా బాధగా వుంది. మనశ్శాంతి కోసం దేవుడి దగ్గరకు వచ్చాను. నా కారణంగా, మీ అమ్మాయి పెళ్ళి ఆగిపోతే, ఆ బాధ నన్ను జీవితమంతా వెంటాడుతుంది," అన్నాడు.

ఈ మాటలకు ఆనందుడు నొచ్చుకుంటూ, "అనవసరంగా మీరు బాధపడకండి. ముక్కూ మొహం తెలియనివాళ్ళను అప్పడగడం, నా తప్పు. మీరు లేదంటే అది సహజం," అన్నాడు.

"నన్ను అప్పడగడం తప్పనుకుంటున్నారు. అంటే, నా ప్రవర్తనకు, మీ మనసు చాలా బాధ పడింది. అందుకే మనశ్శాంతికోసం దేవుడి దగ్గరకువచ్చారు.అవునా?" అన్నాడు మల్లినాధుడు.

అప్పుడానందుడు అతడికి, తన అన్న డబ్బిచ్చిన విషయం చెప్పాడు. అది విని, "మంచివాళ్ళకెప్పుడూ మంచే జరుగుతుంది. ఇప్పుడు మీరు మంచివాళ్ళని రుజువయింది. కానీ నేనే ఒక మంచి మనిషికి సాయం చేయ లేకపోయాను. ఇప్పుడు నా బాధ ఇంకా ఎక్కు వయింది," అన్నాడు మల్లినాధుడు.

తాను మల్లినాధుడి ప్రవర్తనకు ఏమాత్రం బాధపడలేదని, పైగా ఇప్పుడు సంతోషంలో మునిగి తేలుతున్నాననీ అతణ్ణి నమ్మించడా నికి, ఆనందుడికి తలప్రాణం తోకకు వచ్చింది.

ఆ తర్వాత రెండు రోజులకు మల్లినాధుడు,



ఆనందుణ్ణి బట్టలదుకాణంలో కలవడం తటస్థించింది. ఆనందుడు కాస్త ఖరీదు తక్కు వైన బట్టలు కొంటున్నాడనిపించి, "అడగ్గానే నేను మీకు సాయపడి వుంటే, బట్టలకు మరి కాస్త ఎక్కువ ధర పెట్టి వుండేవారు," అంటూ బాధపడ్డాడు, మల్లినాధుడు.

ఆ విధంగా వాళ్ళిద్దరూ ఎక్కడ తటస్థపడినా, మల్లినాధుడు తను అప్పివ్వలేదని పదేపదే వాపోతూండేవాడు.

తర్వాత ఆనందుడు, మల్లినాధుడి కుటుం బాన్ని పెళ్ళికి పిలిచాడు. "నేను డబ్బుండీ మీకు అప్పివ్వలేదు. అప్పివ్వకపోయినా, మీరు నన్ను పిలిచారు," అంటూ మళ్ళీ బాధపడ్డాడు మల్లినాధుడు.

అతడు అక్కడ పెళ్ళి జరుగుతున్నప్పుడు కూడా ప్రతి తంతులోనూ, తను అప్పివ్వక

పోవడాన్ని తల్చుకుని బాధపడ్డాడు. అతడికి ఊరట కలిగించడానికి ఆనందుడు పడ్డ శ్రమ, మగపెళ్ళివారికి మర్యాదలు చేయడంలో కూడా పడలేదు.

ఆ సమయంలో ఆనందుడి అన్న వినోదుడు హడావిడిగా అక్కడికి వచ్చి, ''ఒరే, ఆనందూ! పెళ్ళికొడుకు అక్కచెల్లెళ్ళకూ, వాళ్ళ భర్తలకూ లాంఛనాలుగా పట్టుబట్ట లతోపాటు, బంగారు ఉంగరాలు పెట్టడం, వాళ్ళ ఆచారమట. నువ్వు ఒట్టి బట్టలు మాత్రమే పెట్టావని ఒకటే గొడవచేస్తున్నారు,'' అన్నాడు.

''ఇప్పుడేం చేయాలో పాలుపోవడం లేదు. ఉన్న డబ్బంతా ఖర్చయిపోయింది,'' అన్నాడు ఆనందుడు విచారంగా.

ఆ వెంటనే మల్లినాధుడు, ''నేను మీర డిగినప్పుడే అప్పు ఇచ్చివుంటే, మీకిన్ని చిక్కులు వచ్చేవి కావు. నా నియమం కార ణంగా సాయపడలేకపోయాను. మీ చిక్కు లన్నిటికీ నేనే కారణం!'' అని తెగ బాధపడి పోసాగాడు.

అప్పుడు వినోదుడు కల్పించుకుని, ''అప్పుతో పరిచయం కారాదు, అన్నదే కదా మీ నియమం? ఇప్పుడు మీరు, మా తమ్ము డికి బాగా పరిచయమైన మిత్రులే కదా! కాబట్టి, సందేహించడం ఎందుకు-రెండు వందల వరహాలైనా నిరభ్యంతరంగా ఇవ్వ వచ్చు. అది మీ నియమానికి అడ్డురాదు. పెళ్ళిని ఘనంగా జరిపించి ఆనందించవచ్చు,'' అన్నాడు.

''అలాగా! అవును నిజమే. ఇప్పుడే వస్తాను,'' అంటూ మల్లినాధుడు అక్కడి నుంచి మెల్లగా జారుకున్నాడు.

ఈ జరిగినదానికి విస్తుపోయి చూస్తున్న ఆనందుడితో, వినోదుడు, ''ఒరేయ్, ఇప్పుడు నేనన్నదానితో నీకు, మల్లినాధుడి బెడద వదిలిపోయింది. ఇకపై అతడు, నీకేసి తిరిగి చూడడని నా నమ్మకం,'' అంటూ నవ్వి, ''పెళ్ళికొడుకు తరఫువారి లాంఛనాల గొడ వంతా నేను కల్పించి చెప్పాను. నువ్వేమీ ఆదుర్దాపడకు,'' అన్నాడు.

ఆ తర్వాత పెళ్ళి ఘనంగా జరిగిపో యింది. మల్లినాధుడు తిరిగి రాకపోగా, ఆనాటినుంచీ అప్పిచ్చి సాయపడలేకపో యాను, అంటూ అందరికీ చికాకు కలిగించే ధోరణిని మానుకున్నాడు.



మనపూర్వగాథలు : 13

# తప్పించుకోలేని దొంగ!



భక్తకవీ, గొప్ప సాధువూ అయిన తులసీదాసు వారణాసిలో చిన్న ఆశ్రమం ఏర్పరచుకుని నివసిస్తూ ఉండేవాడు. ఆయనతోపాటు కొందరు శిష్యులు ఉండేవారు. గురువు బోధలు వింటూ, ఆయన అవసరాలు సమకూరుస్తూ వాళ్ళు ఆశ్రమంలోనే కాలం గడుపసాగారు. తులసీదాసు శ్రీరాముడి అమరగాథను రామచరిత మానస్ పేరుతో రమ్యమైన గీతాలుగా రచించసాగాడు. ఆయన గీతాలు మనోహరంగా ఉండేవి. ఆయన పాటలు, పద్యాలు రచించాకమెల్లగా చదివి చూసేవాడు. ఆ గీతాలు చెవిన పడినవారు పూర్తిగా విన్నతరవాతగాని అక్కడినుంచి కదిలేవారు కాదు. అంత మధురంగా ఉండేవి ఆ గీతాలు. మరీ కొందరయితే, తులసీదాసు కుటీరం వెలుపల కూర్చుని ఆయన గానం చేసే గీతాలను గంటల తరబడి విని ఆనందించేవారు.

తులసీదాసు ఆశ్రమానికి కొద్ది దూరంలో తిముడనే ఒక గజదొంగ వచ్చి చేరాడు. వాడు చాలా నేరాలు చేశాడు. ఎన్నోసార్లు నగర రక్షకులకు పట్టుబడి కఠినశిక్షలు అనుభవించాడు. అయినా, చెరసాలనుంచి వెలుపలికి రాగానే పాత నేరమయజీవితాన్ని ఆరంభించేవాడు. దొంగతనాలు మొదలుపెట్టేవాడు.

తిముడి దృష్టి తులసీదాసు ఆశ్రమం మీద పడింది. తులసీదాసు ఆశ్రమం వెలుపలి తలుపులూ, లోపలి గదుల తలుపులూ ఎప్పుడూ తెరిచే ఉండడం వాడు పసిగట్టాడు. ఎలాగైనా ఆశ్రమం లోపలికి వెళ్ళి ఏముందో చూడాలనుకున్నాడు. ఒకనాడు కొందరు భక్తులతో కలిసి మామూలు భక్తుడిలాగా ఆశ్రమంలో అడుగుపెట్టాడు. అక్కడికి వచ్చిన భక్తులలో కొందరు పెద్ద వర్తకులు కూడా ఉన్నారు. వాళ్ళు సరుకులు కొనడానికి డబ్బుతో నగరానికి వచ్చారు. అయినా, ఆశ్రమంలో వాళ్ళు డబ్బును గురించి ఏమాత్రం పట్టించుకోకుండా ప్రశాంతంగా ఉన్నారు. డబ్బు సంచీలను తులసీదాసు కుటీరంలోని ఒక మూలలో ఉంచి, ఆయన ఆలపించే భక్తిగీతాలను తన్మయత్వంతో వింటున్నారు!



తిముడు వాళ్ళ వెనక కూర్చున్నాడన్నమాటే గాని, వాడి చూపులన్నీ డబ్బు సంచీల మీదే ఉన్నాయి. కొంతసేపటికి వాడికి తెలియకుండానే వాడి ఆలోచనలు కూడా తులసీదాసు మాటలు, పాటలకేసి మళ్ళాయి. ఆయనపఠిస్తున్నగీతాలు ఎంతో శ్రావ్యంగా ఉన్నాయి. వాటిని వింటూ, తిముడు తాను ఆశ్రమానికి వచ్చినపనిని మరిచి పోయాడు.

వాడు మరునాడు కూడా భక్తులతో కలిసి ఆశ్రమానికి వెళ్ళాడు. మూడో రోజు వెళ్ళాడు. క్రమంగా అది వాడికి ఒక అలవాటుగా మారింది. ఆశ్రమవాసులతో పరిచయం ఏర్పడింది.

తులసీదాసు ఆరాధించే శ్రీరాముడి భక్తుడి గానే తిముణ్ణి అందరూ భావించారు. ఆయన ఆలపించే గీతాలను వాడు భక్తితో ఆలకిస్తున్నా డనే శిష్యులు అనుకున్నారు. అయితే, తిముడి దృష్టి, ఆలోచనలు ఎల్లప్పుడూ డబ్బు సంచీల చుట్టూ కేంద్రీకృతమయ్యాయి. ఎప్పుడెప్పుడు వాటిని దోచుకు వెళదామా అని ఉబలాటపడ సాగాడు.

ఒకరోజు పొరుగు పట్టణమైన సారనాథ్ నుంచి వచ్చిన సేఠ్ అనే ధనిక వర్తకుణ్ణి చూసి తిముడు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయ్యాడు. సేఠ్ ఇతర భక్తులతో మాట్లాడడం పొంచి విన్నాడు. సేఠ్ విలువయిన వస్తువులను కొనడానికి వచ్చా డనీ, అయితే, శివాలయంలో సాయంకాలం జరుగనున్న ఉత్సవాన్ని దర్శించి, రాత్రంతా ఆశ్రమం లోనే గడిపి, తెల్లవారాక వెళ్ళి సరుకులను కొన నున్నట్టూ అతడి మాటలనుబట్టి గ్రహించాడు.

తిముడు దీనినొక సువర్ణావకాశంగా భావించాడు. ఇంతకు ముందు తిముడు సారనాథ్ లోని సేఠ్ భవనంలో దొంగతనానికి పూనుకుని, సాధ్యపడక, కాపలాభటుల నుంచి ఎలాగో తప్పించుకుని బయటపడ్డాడు. ఇప్పుడు సేఠ్ ఆశ్రమంలో లేని సమయం చూసి, ఆయన అక్కడ వదిలి వెళ్ళే ధనాన్ని రాత్రికి రాత్రే సులభంగా దొంగిలించవచ్చు అనుకున్నాడు.

సూర్యాస్తమయం అయ్యాక సేఠ్‌తోపాటు ఆశ్రమవాసులందరూ దేవాలయానికి బయలు దేరడం చూసిన తిముడు మరింత ఆనంద పడ్డాడు. ఆశ్రమం మొత్తానికి వాడూ, సాధువూ మాత్రమే మిగిలారు. సాధువు కుటీరంలో ఒక మూల కూర్చుని తాళపత్రాలను చదువుకుంటు న్నాడు. తిముడు తన అదృష్టానికి ఎంతగానో పొంగిపోయాడు.

తులసీదాసుకు సైతం అనుమానం కలగ కుండా వాడు కొంతసేపు ఆయనకుటీరం ముందు నిలబడ్డాడు.

తులసీదాసు మందహాసం చేస్తూ తలెత్తి, "ఏం నాయనా! ఏమైనా చెప్పాలనుకుంటు న్నావా?'' అని అడిగాడు.

"అవును, స్వామీ! నేను ఇంటికి వెళ్ళాలను కుంటున్నాను. ఆశ్రమంలో ఎవరూ లేరే అని ఆలోచిస్తున్నాను. తమరు ఒంటరిగా ఉన్నారు కదా?'' అన్నాడు తిముడు.

"ఎవరూ లేరని ఎవరన్నారు? నిర్విచారంగా వెళ్ళిరా, నాయనా,'' అన్నాడు సాధువు.

''స్వామీ ఆశ్రమంలో ఎవరూ కాపలాకు లేరు. తలుపులన్నీ తెరిచే ఉన్నాయి,'' అన్నాడు తిముడు.

''కాపలా లేకుండా అన్ని తలుపులూ తెరిచే ఉన్నాయని ఎవరన్నారు?'' అని, ఆయన మళ్ళీ తాళపత్రాలు చదవడంలో లీనమైపోయాడు.

తిముడు కొంతసేపు అటూ ఇటూ తిరిగి, కుటీరంలోకి వెళ్ళి, సేఠ్ డబ్బు సంచీని ఎత్తుకుని ద్వారం కేసి నడిచాడు. అయితే, అక్కడి దృశ్యం చూసి ఠక్కున ఆగిపోయాడు. ఒక దృఢకాయుడైన యువకుడు బాణం, విల్లూ చేత బట్టి వాకిలిముందు పచార్లు చేస్తున్నాడు. బహుశా ఆలయంలో జరుగుతూన్న ఉత్సవంలో పాల్గొనేందుకు వెళుతూన్న వేషగాడెవడో, తన మిత్రుల కోసం వేచి ఉన్నాడు కాబోలు అనుకున్నాడు, తిముడు.

సరే, ఈ ద్వారం కాకపోతే, ఎదురుగా ఉన్న ద్వారం గుండా వెళదామని తిముడు అటుకేసి అడుగులు వేశాడు. అక్కడా అదే దృశ్యం! చేత బాణం, విల్లు పట్టిన యువకుడు గంభీరంగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. తిముడు అతన్ని కొన్నిక్షణాలు రెప్పవాల్చకుండా చూశాడు. అంతలో, సేఠ్ ఆలయం నుంచి తిరిగి వచ్చేలోగా అక్కణ్ణించి తప్పించుకోవాలన్న ఆలోచన రావడంతో, మూడవ ద్వారం కేసి వేగంగా నడిచాడు. అక్కడా ఆ అందమైన యువకుడే ఎదురయ్యాడు! తిముడు నాలుగవద్వారం కేసి పరిగెత్తాడు. అక్కడా అదే దివ్యమోహనరూపుడే కనిపించాడు!

''ఏమయింది నాయనా? ఒక్కొక్కద్వారం దగ్గరికీ వెళ్ళి తిరిగి వస్తున్నావేమిటి?'' అంటూ తులసీదాసు అక్కడికి వచ్చాడు.

తిముడు తిరిగి చూసి, స్పృహ తప్పి నేలకు ఒరిగాడు. సాధువు వాడి ముఖం మీద నీళ్ళు చల్లి స్పృహ తెప్పించాక, ''స్వామీ, నేను చూసిందేమిటి? తమ ఆశ్రమాన్ని కాపలా కాస్తూన్న ఆ విచిత్ర వ్యక్తి ఎవరు?'' అని అడిగాడు.

''విచిత్ర వ్యక్తి కాదు నాయనా, నీకు చాలా సన్నిహితుడు. నీ హృదయంలో కొలువున్న నీలమేఘశ్యాముడు! సర్వజగద్రక్షకుడు శ్రీరామచంద్రుడు!'' అన్నాడు సాధువు.

తిముడు ధారలుధారలుగా కన్నీరుకారుస్తూ, సాధువు పాదాలపైబడి, ''మహాత్మా! పాపాత్ముడినైన నన్ను క్షమించండి!'' అని వేడుకున్నాడు.

''నాయనా, నువ్విప్పుడు పాపాత్ముడవు కావు. పుణ్యాత్ముడవు! పరమయోగులకే అసాధ్యమైన శ్రీరామచంద్రుడి దర్శనం పొందావు. నీ జన్మ ధన్యమయింది!'' అన్నాడు సాధువు అతన్ని ఆప్యాయంగా లేవనెత్తుతూ.

ఆ తరవాత తిముడు ఆశ్రమంలోనే ఉంటూ, తులసీదాసు బోధలు వింటూ, భక్తితో ఆయనకు పరిచర్యలు చేస్తూ ప్రశాంతంగా శేషజీవితం గడిపాడు.

–బిందుసార్






# సందేహం!

రామనాథానికి చాలాకాలం నుంచి, చిత్రలేఖనం నేర్చుకోవాలని వున్నది. కాని, ఎంతో కాలంగా అనుకూలించని పరిస్థితులతో పాటు, తగినంత పట్టుదలా, శ్రద్ధా లేకపోవడంతో, నలభై సంవత్సరాల వయసువాడైనా, ఆ కోరిక అలాగే మిగిలిపోయింది.

అయితే, సమస్యలు చక్కబడి, పరిస్థితులు అనుకూలించాక, రామనాథానికి ఇప్పటి తన వయసును దృష్టిలో పెట్టుకుని, చిత్రలేఖనం నేర్చుకోవడం నలుగురిలో నామోషిగా తోచింది.

ఈ విషయంలో, తనకు బాగా పరిచయస్థుడైన తల నెరిసిన ఎనభై ఏళ్ళ ఆచారి నుంచి, తగిన సలహా రాబట్టదలచి, రామనాథం, ఆచారి ఇంటికి బయలుదేరాడు. ఆయన ఆచారి ఇల్లు చేరేసరికి, అక్కడ చిన్నపిల్లలకు ఫిడేలు నేర్పుతున్న ఒక యువకుడు - మధ్య మధ్య ఆచారికి రాగస్వరాలు ఎలా పలికించాలో చెపుతూ, దొర్లిన తప్పులను సరిదిద్దుతూండడం చూశాడు.

రామనాథానికి సందేహం తీరిపోయింది. ఏ విద్యనైనా నేర్చుకోవడానికి ఆసక్తి ఉండాలే తప్ప వయసు ప్రమేయం లేదని గ్రహించాడు. ఆయన ఆనందంగా, ''ఔరా!'' అనుకుని, ఇక ఆచారిని సలహా అడగడమెందుకు అనుకుంటూ, తిరిగి ఇంటికి ప్రయాణమయ్యాడు.

- ఆరుపల్లి

# చందమామ కబుర్లు

## స్నూపీ పార్క్



పీనట్ కామిక్స్‌లో వచ్చే ముద్దులపాత్ర స్నూపీ అంటే ఇష్టపడనివారంటూ ఉండరు. స్నూపీ అభిమానులకు ఒక సంతోషకరమైన వార్త. స్నూపీకంటూ ప్రత్యేకంగా ఒక థీమ్ పార్క్ రూపొందుతోంది. దక్షిణ చైనాలోని గువాంగ్ దాంగ్ ప్రాంతం షిండే నగరంలో రూపొందిన ఈ పార్క్ ప్రారంభం కావడానికి సిద్ధంగా ఉంది. దాదాపు 5,50,000 చ.మీ. విస్తరించిన 'స్నూపీ గార్డెన్,' 'స్నూపీ ప్లేగ్రౌండ్' 12.2 మిలియన్ డాలర్ల వ్యయంతో రూపొందించబడింది. ప్రపంచంలోని ఈ రకం పార్కుల్లో ఇది మొట్టమొదటిది అని చెబుతున్నారు!

## అతిపెద్ద షూ!

మనిలా పొలిమేరల్లోని మరికినా నగరం ఫిలిప్పైన్స్ 'షూ క్యాపిటల్' గా పేరు తెచ్చుకున్నది. ప్రపంచంలోనే అతిపెద్దషూల జతను తయారుచేసి అది గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో స్థానం సంపాదించనుంది. కార్డొవాన్ చర్మంతో తయారుచేయబడిన ఈ షూల ఎత్తు 5.5 మీ (17 అడుగుల కన్నా ఎక్కువ). అంటే 2002 ఫిబ్రవరిలో టర్కీలో తయారుచేసిన షూలకన్నా ఇంచుమించు 2 మీ. ఎక్కువ ఎత్తయినవన్నమాట!



## నాట్యంచేసే రోబో!



మనిషిలా రకరకాల పనులుచేసే రోబోలు చాలా ఉన్నాయి. ఇటీవల మనిషిలా నడుస్తూ, నాట్యం చేసే 'అసిమో' అనే రోబోను ప్రపంచంలోనే మొట్టమొదటిసారిగా రూపొందించారు. దీని బరువు 52 కి.గ్రా. ఎత్తు 1.2 మీ. నాట్యం చేశాక ప్రేక్షకుల చప్పట్లకోసం వేచిఉండి ఆ తరవాత తన స్థానానికి వెళ్ళడం ఈ రోబో విశేషం. మలేషియా క్వాలాలంపూర్‌లో ఇటీవల జరిగిన ఒక కార్యక్రమంలో 'అసిమో'ను పరిచయం చేశారు!

## మహారాష్ట్ర జానపద కథ

# కోట ముట్టడి!

కోటలు, గుహలు, దేవాలయాలు నిండిన భూమిగా పేరుగాంచినది మహారాష్ట్ర. ఒకనాటి బొంబాయి ప్రెసిడెన్సీ నుంచి మరాఠీభాష మాట్లాడే ప్రాంతాలన్నిటినీ కలిపి 1960 లో ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటుచేశారు. ఇది మనదేశంలో అధిక జనాభాగల రాష్ట్రాలలో ఒకటి. 2001 జనాభా లెక్కల ప్రకారం మహారాష్ట్ర జనాభా 9,67,52,247. దీని వైశాల్యం 3,07,690 చ.కి.మీ.

'మహారథి' అనే మాట నుంచి మహారాష్ట్ర వచ్చిందని చెబుతారు.

మహారాష్ట్ర అంటే గొప్పరాష్ట్రం అని కూడా చెప్పవచ్చు.

ఇంకా కొందరు 'మహా కంటార' (దండకారణ్యం) అనే మాటే కాలక్రమంలో మహారాష్ట్ర అయిందని కూడా చెబుతారు.

మహారాష్ట్రకు పడమరగా అరేబియా సముద్రం, వాయవ్యంలో గుజరాత్, ఉత్తరంగా మధ్యప్రదేశ్, ఆగ్నేయంగా ఆంధ్రప్రదేశ్, దక్షిణంగా కర్నాటక, గోవా రాష్ట్రాలు సరిహద్దులుగా ఉన్నాయి.

మహారాష్ట్రలోని నాగ్‌పూర్ నగరం మనదేశానికి దాదాపు కేంద్ర బిందువుగా ఉంటున్నది. ముంబాయి రాజధానీ నగరం. మరాఠీ ప్రధానభాష.



అది ఒక సోమవారం ఉదయ సమయం. రాజప్రాసాదం ఉపరితలంపై రాజమాత ముత్యాలు పొదిగిన దువ్వెనతో తల దువ్వుకుంటున్నది. ఆమె యథాలాపంగా తూర్పు కేసి తల తిప్పినప్పుడు, ఆమె దృష్టి దూరంగా ఉన్న ఒక కోటపై పడింది. ఆ కోట ఉదయ సూర్యుడి కాంతి కిరణాలతో స్ఫటికంలా నిగనిగలాడుతున్నది. ఆ దృశ్యం ఆమె ఆగ్రహానికి ఆజ్యం పోసింది!

ఆమె సేవకులను పిలిచి, "వెంటనే మీరు వెళ్ళి నా కుమారుణ్ణి పిలుచుకురండి. భోజనం చేస్తున్నాసరే, ఉన్నఫళాన రమ్మన్నానని చెప్పండి,"

అని ఆజ్ఞాపించింది. అలా ఆజ్ఞాపించిన ఆ రాజమాత మరెవరో కాదు; సుప్రసిద్ధ మరాఠీ వీరుడు ఛత్రపతి శివాజీ తల్లి జిజాబాయి. ప్రతాపగడ్ కోట నుంచి ఆమె చూసింది శత్రువుల దృఢమైన సింహగడ్ కోట! ఆ కాల ఘట్టంలో సింహగడ్ మొగలుల ఆధీనంలో ఉండేది. రాయగడ్‌లో ఉన్న శివాజీని రమ్మని ఆమె ఆజ్ఞాపించింది.

దూత వచ్చి తన తల్లి ఆనతిని తెలియజేయ గానే, శివాజీ దానిని తలదాల్చాడు. వక్షానికి కవచాన్నీ, వేళ్ళకు పులిగోళ్ళనూ తగిలించు కుని, కత్తీ డాలూ చేతబట్టుకుని, తన నల్లటి గుర్రమైన కృష్ణను అధిరోహించి ప్రతాపగడ్‌కు బయలుదేరాడు. వాయువేగంతో వచ్చి తల్లి ఉన్న భవనం ముందు వాలాడు.

''అమ్మా! అంత త్వరగా నన్ను రమ్మన్న కారణం ఏమిటి? తమకే బాధలూ లేవు కదా?'' అని అడిగాడు తల్లికి నమస్కరిస్తూ.



జిజాబాయి ఆ ప్రశ్నకు సూటిగా సమా ధానం చెప్పకుండా శివాజీని చదరంగం ఆడ డానికి ఆహ్వానించి బల్లవద్దకు తీసుకుపోయి, ''ఈ ఆటలో నేను గెలుపొందితే, నేను అడిగిన కోటను నువ్వు ఇవ్వాలి!'' అన్నది.

శివాజీ నెమ్మదిగా, ''అమ్మా! క్రీడలలో సైతం బిడ్డలు కన్నవారికి ప్రత్యర్థులు కారాదు. దయ చేసి నన్ను ఆ పనికి పురికొల్పకండి,'' అన్నాడు వినయంగా.

అయితే జిజాబాయి అతని మాటలు వినిపించుకోలేదు. తప్పక ఆడాలని పట్టు బట్టడంతో శివాజీకి అంగీకరించక తప్పలేదు. తమ ఇలవేల్పు భవానీమాతను ప్రార్థించి ఆమె ఆటకు ఉపక్రమించింది.

ఆటలో జిజాబాయి సునాయాసంగా గెలు పొందింది. ''అమ్మా, నా ఆధీనంలో ఉన్న ఏ కోటనైనా తమరు స్వీకరించవచ్చు,'' అన్నాడు శివాజీ సంతోషంగా చేతులు జోడించి.

''నీ వశంలో ఉన్నవి వద్దు. నాకు కావల సింది సింహగడ్ కోట!'' అన్నది జిజాబాయి గంభీరంగా.

శివాజీ ఒక్క క్షణం మౌనం వహించాడు. సింహగడ్ కోట చాలా దుర్భేద్యమైన దుర్గమని అతడు విని ఉన్నాడు. దానిని పట్టుకోవడం అంత సులభం కాదు గనక, శివాజీ సందిగ్ధంలో పడ్డాడు.

''సింహగడ్ ఉదేభాన్ అధీనంలో ఉన్నది. దానిని వశపరచుకోవడం కష్టం అన్నసంగతి మీకు తెలియనిది కాదు. దయచేసి దానికి బదులు నా కోటలలో ఏదైనా ఒకదానిని తీసు కోండి,'' అన్నాడు శివాజీ ప్రాధేయపూర్వకంగా.

అయినా, జిజాబాయి తన నిర్ణయం మార్చుకోలేదు. పైగా, ''నువ్వు నాకు సింహ గడ్‌ను జయించి ఇవ్వకపోతే, నీ రాజ్యమంతా

అగ్నికి ఆహుతి అయ్యేలా శపించగలను,'' అని హెచ్చరించింది తీక్షణంగా చూస్తూ.

శివాజీ అంగీకరించక తప్పలేదు. సరేనని తల్లిని రాయగడ్‌కు వెంటబెట్టుకుని వెళ్ళాడు. సింహగడ్ కోటను ముట్టడించి పట్టుకునే గురుతర బాధ్యతను ఎవరికి అప్పగించడమా అని తీవ్రంగా ఆలోచించాడు. ఆఖరికి అతనికి తన చిరకాల మిత్రుడు, ఉమ్రథేకు చెందిన తానాజీ ములుసారే జ్ఞాపకం వచ్చాడు. ఆ మహత్కార్యాన్ని సాధించగల సర్వసమర్థుడు అతడేనని శివాజీ భావించాడు.

పన్నెండువేల మంది సైనికులతో, మూడు రోజులలోగా రాయగడ్‌కు చేరుకోవాలని తానాజీకి దూతద్వారా లేఖ పంపాడు.

తానాజీకి ఆ సందేశం అందే సమయంలో ఆయన తన కుమారుడి వివాహ ఏర్పాట్లలో నిమగ్నుడై ఉన్నాడు. అయినా, లేఖ అందగానే వివాహవిషయం తరవాత చూసుకుందామని, తానాజీ సైనికులతో రాయగడ్‌కు హుటాహుటిగా బయలుదేరాడు.

బ్రహ్మాండమైన తానాజీ సేనలు రాయగడ్‌ను చేరేప్పుడు అక్కడి సైనిక శిబిరాలలో కలకలం చెలరేగింది. జిజాబాయి సైతం విస్మయం చెందింది. కోట బురుజులపై నుంచి చూస్తే, ఆశ్వికదళాల పదఘట్టనలతో లేచిన ధూళిమేఘాలు ఆకాశంకేసి వెళ్ళడం కనిపించాయి. 'మొగలు సేనలు మన మీదికి దండెత్తి రావడంలేదు కదా?'' అని అడిగింది ఆమె శివాజీని అనుమానంతో.

శివాజీ తల అడ్డంగా ఊపుతూ, 'వేగుల నుంచి ఇంతవరకు అలాంటి వర్తమానం ఏదీ అందలేదు తల్లీ. బహుశా సేనలను వెంట

## కోటలు - గుహలు


Daulatabad Fort

మహారాష్ట్ర సౌందర్యమే అక్కడి కోటలలో, గుహలలో ఇమిడి ఉంది. మహారాష్ట్రను 'దాగ్ అంచా దేశ్' అంటే, బండల ప్రదేశంగా చెబుతారు. రాష్ట్రంలోని 350 కి పైబడిన కోటలు శతాబ్దాల తరబడి వర్షాలకు, సూర్యతాపానికి తట్టుకుని నిలబడి ఉన్నాయి. కొండశిఖరాల మీదా, సముద్రతీరాలలో ఈ కోటలు నిర్మించబడి ఉన్నాయి. వీటిలో చాలావరకు సుప్రసిద్ధ మరాఠీవీరుడు ఛత్రపతి శివాజీకి సంబంధం ఉన్నవే. వీటిని పటిష్ఠమైన రక్షణ కలిగిన పట్టణాలుగా చెప్పవచ్చు. రాజ్‌గడ్, సింధుదుర్గ్, ప్రతాప్ గడ్, దౌలతాబాద్, టోర్నా కోటలు రాష్ట్రంలో చాలా ప్రసిద్ధిచెందిన కోటలు.

అజంతా, ఎల్లోరా గుహలలోని సునిశితమైన వర్ణచిత్రాలు బౌద్ధ సంస్కృతీ వారసత్వానికి సాక్ష్యాలుగా ఉంటున్నాయి. ఈ గుహాలయాలలోని చిత్రాలు గౌతమబుద్ధుడి జీవితగాథను తెలియజేస్తున్నాయి. క్రీ.పూ. 200 సం. ప్రాంతంలో మలచబడిన ఈ గుహలు క్రీ.శ.650 వరకు ఉపయోగంలో ఉండేవి. ఇవి బౌద్ధభిక్షువులకు ప్రశాంత నివాస స్థలాలుగా ఉండేవి.

కాంక్షిస్తూ, భవానీదేవిని స్మరిస్తూ రెండు చేతులను తన కణతులకు నొక్కి మెటికలు విరిచింది!

రాజమాత ఆ చర్యకు తానాజీ చలించి పోయాడు. వెంటనే తన తలపాగాను తీసి రాజమాత పాదాలవద్ద ఉంచి, "మీ ఆజ్ఞను శిరసావహిస్తాను. ఏం చేయాలో ఆజ్ఞాపిం చండి," అన్నాడు.

"నాకు సింహగడ్ కోట కావాలి. దాన్ని నువ్వు నాకు జయించి ఇచ్చావంటే, నిన్ను శివాజీకి తమ్ముడిగానూ, నా సొంత బిడ్డగానూ భావించగలను," అన్నది జిజాబాయి.

తానాజీ అందుకు సంతోషంగా అంగీక రించి, "మహాభాగ్యం!"అన్నాడు.

జిజాబాయి ఆనందంతో ఆ సాయంకాలం తానాజీకీ, ఆయన సైనికుల గౌరవార్థం గొప్ప విందు ఏర్పాటు చేసింది. సైనికులకు దుస్తులు, ఆయుధాలు కానుకలుగా పంచింది.

మరునాడే తానాజీ సైనికులతో అక్కడి నుంచి బయలుదేరాడు. కొంతదూరం ప్రయా ణంచేసి సైన్యం ఆనందబరి అనే ప్రాంతాన్ని చేరుకున్నది. అక్కడ తానాజీ ఒక గ్రామాధికారి వేషం వేసుకుని, అడవిగుండా ప్రయాణం సాగించి ఆఖరికి శత్రుదేశ పొలిమేరలలో ఉన్న సైనిక శిబిరాన్ని సమీపించాడు. అనుకున్నట్టే అతన్ని శత్రుసైనికులు చుట్టుముట్టి పట్టు కున్నారు.

"నేను సఖారా గ్రామాధికారిని. ఒంటరిగా అడవిగుండా వస్తూండగా ఒక పులి నా మీదికి ఉరకబోయింది. దాన్నుంచి తప్పించుకుని పరిగెత్తి వస్తున్నాను. మీ ఆశ్రయం కావాలి," అన్నాడు తానాజీ.

ఆ కట్టుకథను సైనికులు నమ్మేశారు. వక్కలు, నల్లమందు మొదలైనవాటిని ఇచ్చి



బెట్టుకుని వస్తున్నది నా మిత్రుడు తానాజీ కావచ్చు," అన్నాడు.

మరికొంత సేపటికి సేనలు రాజధానిని సమీపించాయి. ఆ వస్తున్నది తాను ఊహించి నట్టు తానాజీ అని గ్రహించి శివాజీ ఆనం దించాడు. అతన్ని ఆదరంగా ఆహ్వానించాడు.

తానాజీ శివాజీని ఆప్యాయంగా కౌగలిం చుకుంటూ, "అవునూ, నేను నా కుమారుడి పెళ్ళి ఏర్పాట్లలో ఉండగా, వెంటనే రమ్మని ఆజ్ఞాపించావేమిటి?" అంటూ మిత్రుడనే చనువుకొద్దీ అడిగాడు.

"తానాజీ, నన్ను క్షమించు. నిన్ను ఇక్కడికి రప్పించడానికి కారణం నేను కాదు. నా తల్లి," అన్నాడు శివాజీ.

అతడు ఆ మాట పూర్తిచేయకముందే, జిజాబాయి భవానీదేవిని కృతజ్ఞతతో స్మరిస్తూ, ఆసనం నుంచి లేచి సంతోషంగా తానాజీని సమీపించింది. చిన్న దీపాన్ని తానాజీ తల చుట్టూ హారతిలా చూపి, తానాజీ క్షేమాన్ని



తానాజీ వాళ్ళను మంచి చేసుకున్నాడు. కొంద రికి చిన్న చిన్న నగలు ఇచ్చాడు. నెమ్మదిగా చాలా తెలివిగా వాళ్ళ స్నేహాన్ని పెంచుకో సాగాడు. అతిత్వరలో కొందరి ప్రత్యేక ఆదరా భిమానాలనూ, విశ్వాసాన్నీ చూరగొన్నాడు.

ఒకనాడు తనకు బాగా సన్నిహితులూ, విశ్వాసపాత్రులూ అయిన సైనికులకు,తాను ఎవరైనదీ, ఎందుకు వచ్చినదీ రహస్యంగా తెలియచేశాడు. దాంతో కోటకు సంబంధిం చిన రహస్యాలను చెప్పడానికి కొందరు సైని కులు సిద్ధపడ్డారు. వాళ్ళనుంచి కొండను ఏ వైపునుంచి సులభంగా ఎక్కగలమో తానాజీ తెలుసుకున్నాడు. ఉదేభాన్ గురించీ, అతడి సేనాధిపతి సిదీ హిలాల్ గురించీ కొందరు సైనికులు తెలియజెప్పారు.

ఆ రాత్రే తానాజీ కొందరు సైనికులతో కోట కల్యాణ్‌ద్వారం దగ్గరికి వెళ్ళాడు. అక్కడ శివాజీ గుర్రాలలో ఒకదాని నడుముకు దృఢమైన తాడును బిగించి, దానిని కొండమీదికి పంపుతూ, ''మా కోసం నువ్వు కొండ శిఖరానికి వెళ్ళు!'' అన్నాడు తానాజీ.

ఆ గుర్రం చాలా తెలివైనదీ, పర్వతారో హణలో శిక్షణ పొందినదీ కావడంతో, సరే నన్నట్టు సకిలించి, ఉత్సాహంగా నిటారుగా ఉన్న కొండనెక్కి కొంతసేపటికి శిఖరాగ్రాన్ని చేరుకున్నది. అక్కడ గిట్టలతో నేలను బలంగా తొక్కిపట్టి, దృఢంగా స్థాణువులా నిలబడింది.

తరవాత తానాజీ, అతని సైనికులు యాభై మంది గుర్రానికి బిగించిన తాడును పట్టుకుని నిటారుగా ఉన్న కొండశిఖరం మీదికి ఒక్కొ క్కరుగా చేరుకున్నారు. అలా ఎక్కేప్పుడు కొందరు కత్తులను నోటితో కరుచుకుని మరీ ఎక్కారు.

కోట ద్వారాన్ని చేరి, హఠాత్తుగా కాపలా భటులపైబడి వారిని చంపారు. ఆ తరవాత ఇంకొక ద్వారాన్ని చేరుకుని అక్కడున్న కాపలా భటులను కూడా హతమార్చారు.

ఒక కాపలాభటుడు వారినుంచి ఎలాగో తప్పించుకుని వెళ్ళి, ముట్టడిని గురించి ఉదేభాన్‌కు చెప్పాడు.

ఉదేభాన్ మొదట తన సేనాధిపతిని కోట రక్షణకు పంపాడు. ఆ పిమ్మట తన కుమారు లను పంపాడు. అందరూ హతమయ్యారు. ఆఖరికి అతడే యుద్ధానికి బయలుదేరి వచ్చాడు. శత్రుసైనికులు కొద్దిమందే ఉండ డంగమనించాడు. యుద్ధానికి తమ నాయ కుడు స్వయంగా రావడంతో మొగల్ సైని కులు నూతనోత్తేజంతో తానాజీ సైనికుల మీదికి విజృంభించారు. ఉదేభాన్ ఒక్క ఊపున వెళ్ళి తానాజీతో తలపడి అతన్ని హతమార్చాడు. తానాజీ అనుచరుడు మెరుపు- ఉరికి మరుక్షణమే ఉదేభాన్ తలను తెగనరికి పగ సాధించాడు!

# కళలు - సంస్కృతి



అజంతా గుహాలయాల కుడ్యచిత్రాల నుంచి వోర్లీ జానపద వర్ణచిత్రాల వరకు రాష్ట్రానికి కళా, హస్తకళా రంగాలలో వైవిధ్యభరితమైన సుదీర్ఘ సంప్రదాయాల చరిత్ర ఉంది.

మహారాష్ట్రకు నేతపరిశ్రమలో ప్రత్యేక చరిత్ర ఉంది. వివిధప్రాంతాలలో వివిధరకాల చీరలను నేస్తున్నారు. వీటిలో ఔరంగబాదుకు చెందిన మష్రు, హిమ్రు వస్త్రాలు; పైథాని చీరలు, షోలాపూర్‌లోని నారాయణపేటా చీరలు ముఖ్యమైనవి. బిద్రీ (లోహ) పాత్రలు, లక్కసామానులు, ప్రపంచ ప్రసిద్ధిగాంచిన కొల్హాపూర్ పాదరక్షలు రాష్ట్రంలో చాలా ముఖ్యమైనవి.

అప్పటికే తానాజీ మిగిలిన సేనలు కూడా పైకి వెళ్ళి కోటను చుట్టుముట్టాయి. ఉదేభాన్ సేనలు సర్వనాశమయ్యాయి. సింహగడ్ తానాజీ సేనల వశమయింది. కోట బురుజుల మీద శివాజీ పతాకాన్ని ఎగురవేశారు. విజయసంకేతంగా ఐదు ఫిరంగులను పేల్చారు!

విజయ వార్తను విని శివాజీ పరమానందం చెందాడు. అతడు తల్లికిచ్చిన మాటను నిలబెట్టుకున్నాడు. అతనికి తానాజీపైనున్న నమ్మకం రుజువయింది. శివాజీ అప్పటికప్పుడే సింహగడ్‌కు బయలుదేరాడు.

అతడు గుర్రంపై నిటారుగా ఉన్న కొండ శిఖరాన్ని ఎక్కి సింహగడ్ కోట కల్యాణ్ ద్వారాన్ని చేరుకున్నాడు. హఠాత్తుగా, తన ఆప్తమిత్రుడూ, అసమాన వీరుడూ అయిన తానాజీ భౌతికకాయాన్ని చూసి గుర్రంపై నుంచి కిందికి దిగాడు. అతడు మిత్రుడి కాయాన్ని పరిశీలనగా చూస్తూండగా, మరాఠా సైనికులు, శివాజీ 'సింహపు' కోటను పట్టుకున్నందుకు అభినందన నినాదాలు మొదలు పెట్టారు.

అయితే, ఆ నినాదాలు ఆపమని శివాజీ చేయెత్తి, ''సింహపుకోట వశమయింది. కాని నేను సింహాన్ని పోగొట్టుకున్నాను,'' అన్నాడు విచారంగా నిట్టూరుస్తూ.





# తృప్తి ప్రధానం

ఒక రోజు మిట్టమధ్యాహ్నంవేళ, ఏటి ఒడ్డున వున్న చెట్టుకింద ఒక స్వామీజీ కూర్చుని ధ్యానం చేసుకుంటున్నాడు. ఆ సమయంలో, నిరుపేద యువకుడొకడు అటుగా వచ్చాడు. వాడు ఎంతో విచారంగా వున్నాడు.

ధ్యానంలో వున్న స్వామీజీని పలకరించడం సరికాదనుకుంటూ వాడు, ఆయన ముందు కొంతసేపు వినయంగా మోకరిల్లి, ఆయన ఎంతసేపటికీ కళ్ళు తెరవబోయేసరికి చివరకు, ''స్వామీ!'' అంటూ మెల్లగా పిలిచాడు.

స్వామి కళ్ళు తెరిచి యువకుడికేసి పరిశీలనగా చూసి, ''ఏమిటి నాయనా, నీ దిగులుకు కారణమేమిటి?'' అని అడిగాడు.

''స్వామీ, నా పేరు ధనదాసు. అయినా, నా దగ్గర చిల్లిగవ్వలేదు. పిడికెడు అన్నం కోసం ఇళ్ళవెంట ఒక పూటంతా తిరగవలసి వస్తున్నది. నా దగ్గర చాలా డబ్బు ఎందుకు లేదు? భరించలేని ఈ పేదరికం కన్నా చావడం నయం కదా!'' అన్నాడు యువకుడు.

''నీ పేరు ధనదాసా, బావుంది!'' అంటూ స్వామీజీ నవ్వి, ''నీ సమస్యకు నేను పరిష్కారంచెబుతాను, ఇక్కడ కాదు, నాతో రా!'' అంటూ లేచాడు.

ధనదాసు సంతోషంగా తల ఊపి స్వామి వెంట నడిచాడు.

కొద్దిసేపటి తర్వాత ఇద్దరూ ఒక పెద్ద భవనంవద్దకు చేరుకున్నారు. అక్కడ ఒక పెళ్ళి విందు కార్యక్రమం జరుగుతున్నది. ఆ భవనంయజమాని చాలా ధనవంతుడు. ఆయన స్వామీజీని అంతదూరాన చూస్తూనే నమస్కరించి గౌరవంగా భవనంలోకి తీసుకువెళ్ళాడు. ఆయనవెంట ధనదాసూ లోపలికి వెళ్ళాడు.

''స్వామీ, నేను మీ సేవకుడిని. మీరు ఏమికావాలన్నా అది చిటికెలో మీ ముందు ఉంటుంది,'' అన్నాడు ధనికుడు.

''సరే, నువ్వు నీ పనులేమిటో చూసుకో. నాకు కావలసినది ఇక్కడి నౌకర్లతో తెప్పించుకుంటాను,'' అన్నాడు స్వామి.

కె. గోపీనాథ్

స్వామి, ధనదాసును తీసుకుని వంట శాలలోకి వెళ్ళాడు. అక్కడ పెద్ద పెద్ద బానల్లో అన్నం సిద్ధంగా వుంది. రకరకాల కూరలూ, తియ్యని తినుబండారాలూ పాత్రల్లో తయారవుతున్నాయి.

ధనదాసుకు నోరూరింది. అతడు వంట కాల కేసి ఆత్రంగా చూస్తున్నాడు. అది గమనించిన స్వామి, "ఆలస్యం ఎందుకు? వెళ్ళి తిను," అన్నాడు.

ధనదాసు ఒక పెద్ద పళ్ళెం తీసుకుని, అందులో చక చకా తనకు కావలసిన పదార్థాలన్నీ వేసుకుని, ఆవురావురుమంటూ తినడం మొదలు పెట్టాడు. పదిహేను నిముషాల అనంతరం ధనదాసు కడుపు నిండిపోయింది. అతడు ఇక తినలేనన్నట్టుగా అటూ ఇటూ చూడసాగాడు.

స్వామి ప్రోత్సహిస్తున్నట్టుగా, "ఊ, ఆగావేం? కానివ్వు," అన్నాడు.

"ఈ తిన్నది చాలు స్వామీ! ఇంకా తినడంనావల్ల కాదు," అన్నాడు ధనదాసు ఆయాసపడుతూ.

"అదేమిటీ, ఇక్కడ మణుగులకొద్దీ ఆహారపదార్థాలున్నాయి. మళ్ళీ మళ్ళీ దొరుకుతాయా? ఇంతకన్న నీకేం కావాలి, తిను, హాయిగా వుండు," అన్నాడు స్వామి నవ్వుతూ.

"క్షమించండి, స్వామీ! ఒకేసారి ఎన్నో రోజులకు సరిపడే ఆహారాన్ని తినడం ఎవరికైనా సాధ్యమా? ఏ రోజు తినవలసింది, ఆ రోజే కొద్ది కొద్దిగా తినగలం," అన్నాడు ధనదాసు.

"అంతేకదా! మరి డబ్బు విషయంలోనూ అలాగే ఎందుకు ఆలోచించవు? ఒకేసారి ఎంతో డబ్బు కావాలనుకోవడం ఎందుకు? అది ధనానికి దాస్యం అనిపించుకుంటుంది కాని; ధనానికి యజమాని అనిపించుకోదు. ఎప్పటికప్పుడు సాధ్యమైనంతలో కొద్దికొద్దిగా కష్టపడి సంపాదించుకుంటే చాలదా? మనిషికి అత్యాశ ఉండకూడదు. ఆశ తీరక ఆందోళన కలుగుతుంది. ఆందోళనలేని జీవితం సంతృప్తికరంగా వుంటుంది. మనిషికి తృప్తి ప్రధానం!" అన్నాడు స్వామి.

"స్వామీ! మీరు నా సమస్యను పరిష్కరించారు!" అంటూ ధనదాసు, స్వామి పాదాలు తాకి, అక్కడి నుంచి ఉత్సాహంగా బయల్దేరాడు.



# మనదేశం గురించి తెలుసుకుందాం

1. స్వాతంత్ర్యానికి పూర్వం బ్రిటిష్ ప్రభుత్వ వేసవి రాజధానిగా ఉన్నది ఏది?
   ఎ. శ్రీనగర్ బి. గోదావరి
   సి. డెహ్రాడూన్ డి. డల్హౌసీ
2. సలేరి, ప్రన్హిత, ఇంద్రావతి ఉపనదులను కలిగిన నది ఏది?
   ఎ. కృష్ణ బి. గోదావరి
   సి. కావేరి డి. సబర్మతి



3. ఈ చిత్రంలో వున్న విచిత్రం ఏమిటో చెప్పగలరా?



4. ఈ వంతెనను గుర్తించగలరా? అది ఎక్కడ, ఏ నది మీద నిర్మించబడి ఉన్నది?

5. పంజాబ్, హర్యానా రాష్ట్రాలు ఉమ్మడి రాజధానిని కలిగి ఉన్నాయి. చండీఘడ్‌కు పూర్వం పంజాబ్ రాజధాని ఏది?
   ఎ. జలంధర్ బి. లూధియానా
   సి. అమృతసర్ డి. సిమ్లా
6. బెంగుళూరు ఇటీవల భారతదేశపు 'సిలికాన్ వ్యాలీ'గా పేరు తెచ్చుకున్నది. మరి మన దేశపు స్టీల్ సిటీ అంటే ఉక్కు నగరంగా ప్రసిద్ధిగాంచిన నగరం ఏది?
   ఎ. సేలం బి. రూర్కెలా
   సి. జంషెడ్‌పూర్ డి. భిలాయ్

## ఏప్రిల్ క్విజ్ సమాధానాలు

1. డి. హోమీ బాబా.
2. 1964, దేవికారాణి రోరిక్.
3. డా. ఎస్. జెడ్. ఖాసిం.
4. వాళ్ళు హిమాలయ పర్వతారోహణ సంస్థలో శిక్షణపొందిన తొలి ఇరవై ఒక్క మంది అంధ పర్వతారోహకులు.
5. యాసిం మర్చెంట్.
6. డా. సలీం అలీ, రోములస్ విట్టకెర్.
7. 1957 ఏప్రిల్ 1.
8. టెన్సింగ్ నార్గే, సర్ ఎడ్మండ్ హిల్లరీ ఎవరెస్టు పర్వతారోహణ విజయం.
9. పరం వీర చక్ర.
10. విజయ్ అమృతరాజ్.



# విఘ్నేశ్వరుడు

విఘ్నేశ్వర శిల్పంలోని దేవతావిగ్రహాల గానానికి తన్మయుడైన అగస్త్యుడు, "వాతాపి గణపతీ! నీ అద్భుత శిల్పాన్ని నీవే మలచుకొన్నావు! ఇటువంటి మహోన్నత శిల్పం చెక్కడం ఎవరితరం! నీ లీలలు అద్భుతం, అనంతం!" అన్నాడు.

అప్పుడు విగ్రహంలో నుంచి, "అగస్త్య మహర్షీ! నాకోసమని నేను శిల్పం మలచుకోలేదు. నీ తృప్తికోసం నీ కోరిక నెరవేర్చాను. అంతే! అందువల్ల ఈ మహాశిల్పం కొంతకాలం మాత్రమే ఇక్కడ ఉంటుంది. అటుపిమ్మట అదృశ్య మౌతుంది! ద్వాపరంలో ధర్మరాజు అశ్వమేధ యాగసందర్భంలో, ఇదే స్థానంలో మరొక పెద్ద విగ్రహం ప్రతిష్ఠింపబడుతుంది!" అంటూ విఘ్నేశ్వరుని మాటలు వినిపించాయి – అని మహావిఘ్నేశ్వరశిల్ప విశేషాలను ధౌమ్యుడు అర్జునుడితో చెప్పి, "అర్జునా! ఆ మహాశిల్పాన్నే మనం చూస్తున్నాం," అని ఆగాడు.

అర్జునుడు మహాశిల్పం చుట్టూరా పలుమార్లు ప్రదక్షిణాలు చేసి, భక్తిశ్రద్ధలతో పరిశీలించాడు. మహాశిల్పం విఘ్నేశ్వరుడే. ఆ విఘ్నేశ్వరుడిని అంటిపెట్టుకొని త్రిమూర్తులు, జగదంబ, లక్ష్మీ పార్వతీ సరస్వతులు, నవగ్రహాలు మొదలుకొని అనేకమంది దేవతలు మనోహర శిల్పాలుగా మలచబడ్డారు. విఘ్నేశుని రెండు పాదాల ఇరుకున విఘ్నం బంధింపబడి ఉన్నది. ఎలుకరాజు తోక విగ్రహంచుట్టూరా వలయం చుట్టి ఉన్నది. శిల్పశోభ తిలకించడానికి వేయి కళ్ళున్నా చాలవు అనిపిస్తున్నది.

ఆ అద్భుతశిల్పాన్ని చాలాసేపు తనివితీరా చూశాక అర్జునుడు ధౌమ్యుడితో, "ఆచార్యదేవా! ఇంతటి మహనీయశిల్పం చుట్టూరా



నెలకొన్న వాతాపినగరం మహోన్నత దశ అనుభవించి ఇప్పుడెందుకిలా ఉంది? వాతాపినగర గాథ వినాలని కుతూహలపడుతున్నాను!" అన్నాడు.

ధౌమ్యుడు తిరిగి చెప్పడం ప్రారంభించాడు:

అగస్త్యుడు లోపాముద్ర ఆదేశానుసారం ఏమీ మిగుల్చుకోకుండా, ఉంచిన ధనాన్ని అందరికీ పంచేసి, ప్రజారాజ్యపాలనా బాధ్యతలను,పౌరధర్మాలను అనుసరిస్తూ సుఖజీవనం గడపండని ప్రజలకు చెప్పి, కట్టుబట్టలతో లోపాముద్రతో తన ఆశ్రమానికి తిరిగి వెళ్ళిపోయాడు.

విఘ్నేశ్వర మహాశిల్పాన్నే ప్రజారాజ్య మకుటంగా ఆరాధించుతూ వాతాపినగర ప్రజలు చిరకాలం క్రమబద్ధంగా సుఖజీవనం చేశారు. తరాలు మారాయి. ఆదర్శరాజ్యంగా, ప్రజారాజ్య మార్గదర్శకంగా దినదినప్రవర్ధమానమై విస్తరించిన వాతాపినగరం దేశదేశాంతరాల్లో పేరు పొందింది.

అగస్త్యుడు తన్నుకూడా హతమారుస్తాడనే చావు భయంతో పారిపోయి, వింధ్యాటవుల్లో ఊరూ పేరూ లేని చీకటిబతుకు బతుకుతున్న ఇల్వలుడు వాతాపినగరం పేరు ప్రఖ్యాతులు విని, అగస్త్యుడు అక్కడ లేడని తెలుసుకొన్న మీదట నయవంచనతో సాధించాలనే తలంపుతో, ప్రజాసేవనే జీవితపరమార్థంగా పెట్టుకున్నవాడిలాగ రూపు మార్చుకొని, వాతాపినగర ప్రజల మధ్యకు చేరాడు. నగరంలోని అప్పటి పరిస్థితి కూడా ఇల్వలుడికి కొంతవరకు అనుకూలంగా ఉంది.

క్రమక్రమంగా కాలమహిమవల్ల, వాతాపినగర ప్రజల్లో స్వార్థచింత అంకురించి పెరగసాగింది. ప్రజలమధ్య కలిమిలేములు ప్రారంభమయ్యాయి. ప్రజల్లో భేదాభిప్రాయాలు, పొరపొచ్చాలు తలదాల్చాయి. తెలివితేటలు తెలివితక్కువవారిని, బలహీనులను వంచించడానికి పనికివచ్చాయి.

అలాంటి పతనదశ ప్రారంభంలో ఇల్వలుడు ఒక ప్రజానాయకుడుగా తయారై ఇంద్రజాల విద్యలతో ఒకమహాపురుషుడుగా ప్రజలను ఆకట్టుకున్నాడు.

నగర మధ్యంలో ఉన్న విఘ్నేశ్వర మహాశిల్పం మీద ప్రజలకు గురి ఉన్నంతకాలం అగస్త్యుణ్ణీ, అగస్త్యుడు చెప్పిన నైతిక సూత్రాల్ని మరచిపోరనే విషయం ఇల్వలుడు గుర్తించాడు. తాంత్రిక విద్యలు, మద్యపానీయాలు ప్రజలకు మెల్లగా రుచి చూపించాడు. అగస్త్యుడు నాటించిన ప్రజారాజ్య సూత్రాల శిలాఫలకాలను ఊడబెరికించి, కొత్తకొత్త

సూత్రాలు నూరిపోశాడు. ఒకరినొకరు దోచుకోవడంలో ఉన్న ఆనంద విశేషాన్ని బాగా ప్రచారం చేశాడు. గిరి గీసుకొని కూచోడం అసలు మనిషి లక్షణం కాదనీ, కొత్త కొత్త సుఖాలు తెలుసుకోడానికే బ్రతకడం, అనే సిద్ధాంతానికి ప్రజలను మెల్లగా మళ్ళించాడు. ప్రచ్ఛన్న వేషాలతో చాలామంది రాక్షసులు ఇల్వలుడికి తోడైనారు.

ప్రజాసేవకుడుగా అవతరించి, ప్రజానాయకుడుగా తయారైన ఇల్వలుడు మహానాయకుడై, ప్రజలపై అంకుశంగా మారాడు. అంతఃకలహాలు రేపాడు. వాతాపినగరం కొట్లాటలతో నిండిపోయింది. దుర్మార్గులు అమాయకులను వేటాడుతున్నారు. నగరం అల్లకల్లోలమైపోయింది. చాలామంది ప్రజలు నగరం విడిచి వెళ్ళిపోయారు.

ఇల్వలుడు నగర మధ్యంలో ఉన్న విఘ్నేశ్వర మహాశిల్పాన్ని నేలమట్టం చేయాలని ప్రయత్నాలు ఆరంభించాడు. శతఘ్నుల్ని చుట్టూరా గురిపెట్టించాడు. శిల్పం అడుగు నేలలో ప్రేలుడుమందు దట్టింపించి, అగ్గి ముట్టించడమే తరువాయిగా ఉన్న సమయంలో, అతివిచిత్రంగా అద్భుతం జరిగింది. నిప్పు తగిలించకుండానే మందుగుండు ప్రేలింది. శతఘ్ని శకటాలు అటునుంచి ఇటు వెనక్కు తిరిగి ప్రేలి గుండ్లవర్షం కురిపించాయి. ఆ అగ్నివర్షంలో దుర్మార్గులంతా పిట్టల్లాగా రాలిపడి మరణించారు. చాలా మంది వికలాంగులయ్యారు. వారిలో ఇల్వలుడు కూడా ఒకడు. ఇల్వలుడి ఒక కాలు, ఒక చేయి పోయింది. రక్తసిక్తమైన దేహంతో నేల దొర్లుతూన్న సమయంలో, ఇల్వలుడికి



విగ్రహం నుంచి గంభీర స్వరంతో మాటలు వినిపించాయి.

"ఓరీ, ఇల్వలా!అంగవైకల్యంతో, ముసలితనంతో చివికి చివికి కుళ్ళుతూ చిరకాలం జీవించు! పరమదుర్మార్గుడివైన నీకు అదే సరియైనశిక్ష!" అని విఘ్నేశ్వరుడు శపించాడు.

వాతాపినగరం క్రమంగా తన పూర్వ వైభవాన్ని కోల్పోయి, కొద్దిమంది మనుష్యులతో మాత్రమే ఇప్పుడిలా బీడుపడిపోయింది, అని ధౌమ్యుడు చెప్పడం ముగించాడు.

అర్జునుడు అంతా విని అటు తిరిగి చూసి, ఆశ్చర్యంతో నోట మాట రాక అలా ఉండిపోయాడు. విఘ్నేశ్వర మహాశిల్పం కనిపించలేదు!

"అర్జునా, ఆశ్చర్యపడకు! మహాశిల్పం అదృశ్యమైపోతుందని ఇదివరకే వింటివి కదా!" అని ధౌమ్యుడు అంటూండగా ఆ చుట్టుపక్కల ఉన్న ఒక ముళ్ళపొదలో, ఒక




పండుముసలి వికృతరూపుడు ఒక చేయీ, ఒక కాలుతో నేలమీద శరీరాన్ని ఈడ్చుకొని వస్తూ కెవ్వున అరిచి, మహాశిల్పం ఉండిన వేపు చేతులు చాచి జోడించి గిలగిలలాడుతూ చనిపోయాడు.

అర్జునుడు అది చూసి ఆశ్చర్యపోతూ, "గురుదేవా! ఆ చచ్చినవాడేకదా ఇల్వలుడు!" అన్నాడు.

ధౌమ్యుడు, "ఔను, ఎప్పటికైనా దుర్మార్గులు అలాగే నశిస్తారు!" అన్నాడు.

వార్తాహరులచేత వాతాపినగరానికి బయలుదేరి రమ్మని అర్జునుడు ధర్మరాజుకు కబురు పంపాడు.

హస్తినాపురం నుంచి ధర్మరాజు - భీమ, నకుల, సహదేవులతో వాతాపినగరానికి వచ్చాడు.

ఆ రాత్రి ధర్మరాజు విఘ్నేశ్వర మహాశిల్పం అంతర్ధానమైన ప్రదేశానికి ఎదురుగా కూర్చొని, "నా తమ్ముడు నీ మహాశిల్పం దర్శించాడు. దేవా! నాకూ ఆ భాగ్యం కల్గించవా!" అని కన్నులు మూసి విఘ్నేశ్వరుని ధ్యానిస్తూ వేడుకున్నాడు.

అప్పుడు అతని చెవుల్లో, "ధర్మజా! దేవశిల్పి విశ్వకర్మ, దానవశిల్పి మయుడు కలసి శిల్పులుగా వచ్చి విగ్రహాన్ని చెక్కుతారు. విగ్రహప్రతిష్ఠ జరిగిన వెంటనే యాగాశ్వం ఇక్కడి నుంచి కదిలి ముందుకు వెళ్తుంది. నీ అశ్వమేధయాగం జయప్రదంగా జరుగుతుంది. వాతాపినగరాన్ని పునరుద్ధారణ చెయ్యి! మీ పాండవ సంతతివారైన చంద్రవంశరాజులు చిరకాలం ఈ నగరాన్ని ధర్మం తప్పకుండా పాలిస్తారు!" అనే వాక్కులు వినిపించాయి.

ధర్మరాజు కళ్ళు తెరిచేసరికి ఎదురుగా మహోన్నతంగా విఘ్నేశ్వర మహాశిల్పం దేదీప్యమానంగా కనిపించి కొన్ని క్షణాలలో అంతర్ధానమైంది.

మర్నాటి ఉదయం ఒక తెల్లనివాడు, ఒక నల్లనివాడు ఆ దరిదాపుల్లో పొదల మధ్య ఉన్న పెద్ద స్ఫటిక శిలను పరీక్షిస్తూ కనిపించారు. వారెవరైనదీ గ్రహించి ధర్మరాజు వారికి మొక్కి మర్యాదలు జరిపాడు.

ఆ శిలను పెకలించడానికి తవ్వుతున్నప్పుడు, అక్కడ గొప్పనిధి దొరికింది. ప్రజల నుంచి దోచుకున్న బంగారాన్ని ఇల్వలుడు అక్కడ నిక్షిప్తపరిచాడు. నిధులున్న ఆ చోటు వదలలేక చివికి చివికి వాడు చివరకు మరణం పాలయింది కూడా అక్కడే.

ధర్మరాజు ఆ నిధిని వాతాపినగర అభివృద్ధికి వినియోగించాడు.

ఇద్దరు మహాశిల్పుల చేతుల మీదుగా విఘ్నేశ్వరుని విగ్రహం, మహాశిల్పం అదృశ్యమైనచోటనే గొప్ప ఆలయము, పెద్ద మంటపము తయారైనాయి. విశ్వకర్మ మయుల శిల్పరీతుల అద్భుత సమ్మేళనంతో ఒక గొప్ప శిల్ప సంప్రదాయానికి నాంది అయింది. భరతవంశం వారిచే నెలకొల్పబడినందువల్ల అది భారతీయ శిల్పంగా పేరొంది, కాలాల తరబడి గొప్ప ప్రఖ్యాతి పొంది చిరస్థాయిగా వర్ధిల్లింది.

ఆ విధంగా విఘ్నేశ్వర శిల్పం పూర్తిచేసి శిల్పులిద్దరూ ఎలాగ వచ్చారో అలాగే మాయమయ్యారు.

ఆలయంలో ధర్మరాజుచే విఘ్నేశ్వర విగ్రహ ప్రతిష్ఠ జరిగిన వెంటనే అంతవరకు అక్కడే నిలబడ్డ గుర్రం దౌడుతీసి పరుగెత్తింది. అర్జునుడు, భీముడు సైన్యసమేతంగా దాని వెనక బయలుదేరారు.

ధర్మరాజు అగస్త్యుడు ఏర్పరిచిన ప్రజారాజ్య పద్ధతులతో వాతాపినగర పాలన సాగేలా పాలనాదక్షత ఏర్పాటుచేసిన తరువాత నకుల సహదేవులతోసహా హస్తినాపురానికి తిరిగి వెళ్ళాడు.

ప్రజారాజ్య పర్యాయపదంగా ఆ ప్రాంతం అగస్త్యరాజ్యమనీ, నగరం అగస్త్యనగరమనీ, కొంతకాలం పేర్కొనబడినవి. కాలక్రమాన వాతాపినగరం అనే పేరే దానికి స్థిరంగా నిలిచిపోయింది.

అర్జునుడు దిగ్విజయాన్ని ముగించుకొని గుర్రంతో హస్తినాపురం చేరాడు. అశ్వమేధ యాగం జరిగింది. ధర్మరాజు యాగభాగాలను, విశ్వకర్మకూ, మయుడికీ ప్రత్యేకంగా అర్పించాడు. శిల్పులకు, శిల్పానికి గౌరవ ప్రపత్తులు చేకూర్చాడు.

ధర్మరాజు తర్వాత పరీక్షిత్తు, పరీక్షిత్తు తర్వాత జనమేజయుడు పాలించారు.



జనమేజయుడి సంతతివారైన రాజులు వాతాపినగరాన్ని పాలించసాగారు.

వాతాపినగరాన్ని పాలించిన చంద్రవంశ రాజులలో శత్రుంజయుడు గొప్ప సామ్రాజ్య పిపాసి, వాతాపినగరం రాజధానిగా వాతాపి సామ్రాజ్యాన్ని స్థాపించాడు. సైన్యాల్ని పెంచడానికి ప్రజలమీద విపరీతంగా పన్నులు వేశాడు. నిరంకుశపాలన సాగిస్తూ, ప్రజలచేత ఇల్వలుడు మళ్ళాపుట్టాడు అని అనిపించుకున్నాడు.

అతని కుమారుల్లో కడపటివాడైన చళుకవర్మ చాలా మంచివాడు. అగస్త్యుడి ప్రజారాజ్య సూత్రాలపై గురిగలవాడు. విఘ్నేశ్వరుణ్ణి భక్తితో ఆరాధిస్తూ, విద్యపట్ల, కళలపట్ల ఆసక్తితో ఉండేవాడు. అగస్త్యుడి అంశ అతనిలో ఉన్నదని ప్రజలు అనుకునేవిధంగా ప్రజాభిమానాన్ని సంపాదించాడు.

సామ్రాజ్య విస్తరణకు శత్రుంజయుడు కుమాళ్ళను ఆయత్తంకమ్మన్నాడు.

చళుకుడు తండ్రితో, "జనహింస, పరపీడనతో కూడిన సామ్రాజ్య విస్తరణ కసాయి వృత్తి కంటే ఏం గొప్పది? సామ్రాజ్య విస్తరణ నాకు ఏమాత్రం సమ్మతం కాదు," అని అన్నలతో కలిసి దండయాత్రకు వెళ్ళడం మానేశాడు.

శత్రుంజయుడు మండిపడుతూ, "ఔరా! సింహం కడుపున ఎలుక పుట్టినట్లు రాజవంశంలో తప్పపుట్టావు! నీకు తగిన శాస్తి జరగాలి!" అని అంటూ అప్పటికప్పుడే ఒక ఎలుకను పట్టి తెప్పించి, దానికి చుళుక అని పేరు పెట్టి, దానితో చళుకవర్మకు పెళ్ళి అని చాటించాడు.

చుళుక అసలు పేరు కళ్యాణకింకిణి! ఒక అప్సరస. ఇంద్రుడి శాపం వల్ల ఎలుకగా భూమ్మీద పడింది.

కళ్యాణవేదికపైన వున్న పెళ్ళిపీటలపై రాకుమారుణ్ణీ, ఎలుకనూ చూసి, వచ్చినవారు చేసే కోలాహల పరిహాసానికి చళుకుడు సిగ్గుతో కృంగిపోవాలని శత్రుంజయుడు, ఆ విచిత్ర వివాహానికి రాజుల్నీ, ప్రజల్నీ ఆహ్వానించాడు.

కాని చళుకవర్మ మందహాసం చేస్తూ వారితో, "ఎలుకను మహారాజు కోడలుగా చేయించగల విఘ్నేశ్వరుడు, ఎలుకను చిలుకల కొలికిగా చేసినా చేయవచ్చు, అని మీరంతా నమ్మకపోవచ్చును గాని, నేను నమ్మగలను!" అన్నాడు.





# రాజుగారి పుణ్యం

కనకగిరిని పరిపాలించే కమలాకరుడు గొప్ప కళాప్రియుడు, భోజనప్రియుడు. ఆయన ఆస్థానంలో అనునిత్యం సంగీత కచ్చేరీలూ, నృత్య కార్యక్రమాలూ, పండితసభలూ జరుగుతూండేవి. ఆయన తీరిక చేసుకుని అప్పుడప్పుడూ మారువేషంలో రాజధానికి దాపులనున్న అడవిలో ఒంటరిగా తిరుగుతూ, ప్రకృతి అందాలను తిలకిస్తూ, వివిధరకాల పక్షుల కిలకిలారావాలను వింటూండేవాడు.

అడవిదారిలో నగరానికి కొంచెం పెడగా, ఒకపాతకాలపు చిన్న పూరిల్లున్నది. రాజుగారు అటుమైపుగా అడవిలోకి వెళ్ళేప్పుడు, ఆ ఇంట్లో నుంచి కమ్మటి వంకాయ ఇగురు వాసన గుప్పున కొట్టి, ఆయన జిహ్వాచాపల్యానికి గురయ్యేవాడు.

ఆయన రోజూ తన భవనంలో, పంచభక్ష్య పరమాన్నాలతో విందుభోజనం ఆరగిస్తున్నా, వంటకాలకు అంతఅద్భుతమైనవాసనఏనాడూ ఎరగడు. ఆ ఇంట ఎలాగైనా ఒకసారి భోజనం చేయాలని, ఆయనకు కోరికగా వుండేది.

ఒకరోజు మధ్యాహ్నం రాజు మారువేషంలో, ఆ ఇంటి తలుపు తట్టాడు. వెంటనే ఒక బక్కచిక్కిన పేద ముత్తయిదువు తలుపు తీసి, "ఎవరు బాబూ, ఇంత ఎండన పడి వచ్చారు! ఏం కావాలి?" అని అడిగింది.

రాజు ఏమాత్రం తొణక్కుండా, "పరదేశిని, ఆకలిగొని వున్నాను. ఈపూటకింత భోజనం పెడతారా?" అన్నాడు.

"అయ్యో, ఇప్పుడే మా భోజనాలు అయిపోయాయి. అయితేనేం? ఆకలిమీద వచ్చారు. ముందు లోపలికి రండి," అన్నదామె. ఆమె పేరు అలివేలు.

రాజుగారు లోపలికివెళ్ళి, ముందు గదిలో ఒక పాతకాలపు కుర్చీలో కూర్చున్నాడు. అలివేలు, ఆ పక్కనే చాపమీద నిద్రపోతున్న భర్త పరమేశాన్ని తట్టి లేపుతూ, "వేళకాని వేళలో ఒక పరదేశీ వచ్చాడు. ఆకలిమీద వున్నాడు పాపం! లేచి వెళ్ళి ఇంత వంకాయ ఇగురు చేసి నాలుగు జొన్నరొట్టెలు కాల్చు," అని చెప్పింది.

మాచిరాజు కామేశ్వరరావు



పరమేశం బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ లేచి, రాజుగారికేసి ఒకసారి చూసి, ఆదరా బాదరా పెరటి తోటలోంచి నాలుగు వంకాయలు కోసి తెచ్చి, వంటపనిలో పడ్డాడు.

''మా రాజుగారి పుణ్యాన వంట మా ఆయనే చేస్తాడు,''అంటూ నవ్వింది అలివేలు. భర్త వంట చేయడానికీ, రాజుగారి పుణ్యానికీ వున్న లంకె ఏమిటో బోధపడలేదు, రాజు కమలాకరుడికి.

కొద్దిసేపట్లో రొట్టెలూ, వంకాయ ఇగురూ సిద్ధమయ్యాయి. అలివేలు, రాజుతో, ''భోజనానికి లేవండి. మా రాజుగారి పుణ్యాన, అతిథికి కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళుకూడా ఇవ్వకుండా వంటగదిలోకి ఆహ్వానించవలసి వచ్చింది!'' అని నవ్వింది.

ఆ తర్వాత, అరటి ఆకులో జొన్నరొట్టెలూ, వంకాయ కూరా వడ్డిస్తూ, ''మా రాజుగారి పుణ్యానపరదేశికి, ఇదే గొప్ప విందుభోజనం!'' అన్నది అలివేలు.

రాజు తృప్తిగా భోజనం ముగించి, చేతులు కడుక్కుని వచ్చి, ''మీరు అనుక్షణం, మీ రాజుగారిని తలుచుకోవడం, మీ రాజభక్తికి నిదర్శనం,'' అన్నాడు.

''ఇంకానయం!'' అంటూ ఆ మాటలకు పొట్టచెక్కలయ్యేలా నవ్వింది, అలివేలు. రాజు తెల్లబోయి, ''ఏం? మీ రాజుగారిపట్ల అభిమానం, భక్తీ లేవా?'' అని అడిగాడు చిరుకోపంగా.

దానికి అలివేలు, ''కాస్త వివరంగా చెబుతాను, ఓపిగ్గా వినండి! ఈ రాజ్యంలో సామాన్య పౌరులు లక్షల సంఖ్యలో వున్నారని అసలు మా రాజుగారికి తెలిసినట్టు లేదు. ఆయన కళ్ళకు కవులూ, కళాకారులూ తప్ప మరెవరూ కనిపించరు. మా ఆయన పెద్దచదువులే చదివారు. అయినా ఏం లాభం? రాజ్యంలో యోగ్యులకు ఉద్యోగాలు లేవు. పెళ్ళి సమయంలో లాంఛనాలుగా నా పుట్టింటి వారిచ్చిన డబ్బును వడ్డీలకు తిప్పుతూ గుట్టుగా బతుకు

తున్నాం. నాది భారీ చెయ్యి అనీ, దుబారా చేస్తాననీ రోజూ వంట, ఉద్యోగంలేని నా భర్త చేస్తాడు. ఆయనకు ఉద్యోగం అంటూ లేక పోవడం, రాజుగారి పుణ్యమే కదా!" అన్నది.

రాజు ఆలోచనలో పడ్డాడు. ఇంతలో అలివేలు మళ్ళీ నోరు విప్పింది. "నగరం పక్కగా వెళ్ళే నది నీళ్ళు సముద్రంలో కలు స్తాయికానీ, ప్రజలకు ఉపయోగపడవు. ఆ నీళ్ళను ప్రజలకు అందజేసే ఆలోచన, మా రాజుగారికి రాదు. అందుకే ఆయన పుణ్యాన అతిథులకు కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళిచ్చే భాగ్యానికి నగర ప్రజలు నోచుకోలేదు. ఆ కారణంగానే, మిమ్మల్ని వంటగదిలోకి తిన్నగా తీసుకుపోవలసి వచ్చింది."

రాజు శ్రద్ధగా ఆమె మాటలు వినసాగాడు. అలివేలు మాట్లాడడం ఆపగానే ఆయన ఈసారి చిరునవ్వు నవ్వుతూ, "సరిసరి! ఇంకా రాజుగారి పుణ్యం ఏమైనా వుంటే వినాలని వుంది," అన్నాడు.

తమ రాజుగారి గురించి, ఈ పరదేశికి ఇంతగా వినాలన్న కుతూహలం ఎందుకబ్బా, అనుకుంటూ అలివేలు, "ప్రజల కనీస అవస రాలైన తిండి, బట్ట, నివాసం గురించి, మా రాజుగారు పట్టించుకోరు. అయినా, పాపం - సంగీతం, నృత్యవినోదాల మధ్య ఆయనకు తీరిక ఎక్కడిది! అందువల్లనే, దూరప్రాం తాలనుంచి వచ్చే పరదేశీలకు ప్రజలు, జొన్న రొట్టెలతోనే విందుభోజనం పెట్టవలసివస్తు న్నది. ఇందుకు క్షమించండి!" అన్నది.

దానితో రాజు కమలాకరుడికి, రాజుగా సామాన్యప్రజలపట్ల తన బాధ్యత ఎలా మరి చిందీ తెలిసివచ్చింది. ఆయన, ఆ దంపతు లకు తానెవరైందీ చెప్పి, "నలభీమ పాకాన్ని మరిపించే, మీ ఆయన వంట అమోఘం. ఆయన రాజప్రాసాదంలో వంటవాళ్ళకు తగిన సూచనలు చేయగల సమర్థుడు. ఇక నీ సంగతి; నీవు రాణీగారికి ముఖ్యసఖిగా వుంటూ, ఇలాగే నిర్మొహమాటంగా నీ అభి ప్రాయలు తెలియజేస్తూ వుండు. ఆమెద్వారా వింటూ, నా పాలనలో వున్న లోపాలను అతి త్వరలో సరిదిద్దుకుంటాను! ఆలస్యం ఎందుకు, రేపే మీరు రాజప్రాసాదానికి వచ్చేయండి," అని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

మర్నాడు రాజాంతఃపురానికి భర్తతోపాటు బయలుదేరుతూ, "అంతా రాజుగారి పుణ్యం!" అనుకున్నది అలివేలు ఆనందంగా.





# దేవయ్య ప్రశ్నలు

చుట్టూ కొండలు, కోనలు నిండిన ప్రశాంత వరం అనే గ్రామ సమీపంలో ఉన్న మౌన యోగి అనే ఒక వేదాంతి, నెలకొక్కసారి నిండుపౌర్ణమిరోజు మాత్రమే భక్తులకు దర్శనమిస్తాడు. ఒక గంటసేపు వాళ్ళడిగే రకరకాల ప్రశ్నలకు సమాధానాలిచ్చి సందేహ నివృత్తిచేసి, తక్కిన కాలమంతా ధ్యానంలో గడుపుతాడు.

ఒక పౌర్ణమినాడు ఆయన దర్శనం చేసుకుని ప్రవచనాలు విని, భక్తులంతా సెలవు తీసుకుని వెళ్ళిపోయారు. దేవయ్య అనే ఒక ఆసామీ మాత్రం తలవంచుకుని యోగి ఎదుటే కూర్చున్నాడు. ఆయనకు యాభై ఏళ్ళు దాటి వుంటాయి.

''ఏం, నాయనా, ఏమైనా అడగాలనుకుంటున్నావా?'' అన్నాడు యోగి.

ఒక్క క్షణం తటపటాయించి దేవయ్య, ''స్వామీ, కొన్నాళ్ళుగా ఈ ప్రపంచం గురించీ, సృష్టికర్త అనబడే దేవుణ్ణి గురించీ, మానవ జీవితం గురించీ నాలో రకరకాల ప్రశ్నలు తలెత్తుతున్నాయి. వాటికి సరైన సమాధానాలు తెలుసుకోవాలని తమ దగ్గరికి వచ్చాను,'' అన్నాడు.

''మరి ఆలస్యం దేనికి, అడుగు నాయనా,'' అన్నాడు యోగి.

''స్వామీ! ఈ ప్రపంచంలోని సకల జీవకోటినీ సృష్టించింది, ఆ భగవంతుడేనంటారు గదా? మరయితే, ఉత్తమసృష్టి అనబడే మనుషుల్లో ఇన్ని తేడాలెందుకు? మనిషికీ మనిషికీ మధ్య వైరం, పగ, ద్వేషం, యుద్ధాలు, హత్యలు, మోసాలు–ఇవన్నీ ఏమిటి? తాను సృష్టించిన మనుషులీవిధంగా తయారవుతూంటే, ఆ భగవంతుడెందుకు చూస్తూ వూరుకుంటున్నాడు? ఈ ప్రశ్నలు నన్ను నిరంతరం కలవరపెడుతున్నాయి,'' అన్నాడు దేవయ్య.

జి.సి. జీవి

యోగి మందహాసం చేసి, "నీకెంతమంది సంతానం, నాయనా?" అని అడిగాడు.

"నలుగురు, స్వామీ! ఇద్దరు మగపిల్లలు, ఇద్దరాడపిల్లలు," అని చెప్పాడు దేవయ్య నిర్లిప్తంగా.

"వాళ్ళందరినీ ప్రేమగానే పెంచి పెద్ద చేశావా?" అని ప్రశ్నించాడు యోగి.

"చిత్తం, స్వామీ! అలాగే పెంచాను," అన్నాడు దేవయ్య.

"అలాగా, సరే! వాళ్ళంతా ఇప్పుడెలా వున్నారు? ఎక్కడెక్కడ వున్నారు?" అని అడిగాడు యోగి.

"ఏం చెప్పమంటారు, స్వామీ! మేమూ, మా తల్లీ, తండ్రీ చూపిన అతిగారాబం కారణంగా, పెద్దవాడికి చదువు అబ్బలేదు గాని, అన్ని దుర్వ్యసనాలూ అలవడ్డాయి. పదహారేళ్ళు నిండకుండానే దోపిడీదొంగల ముఠాలో చేరిపోయాడు. ఒక షావుకారును హత్యచేసి ఎటో పరారీ అయ్యాడు. ఈనాటి వరకూ వాడి జాడ లేదు," అన్నాడు దేవయ్య ఎంతో విచారంగా.

"రెండో కొడుకు?" అని ప్రశ్నించాడు యోగి.

"స్వామీ! వాడు బాగా చదువుకున్నాడు. పట్నంలో ఉద్యోగం చేస్తూ, నాకు నెలనెలా కొంత డబ్బు పంపేవాడు. మాకు తెలియకుండానే, ఎవరో కలవారి ఇంటిపిల్లను ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. ఆ తర్వాత పూర్తిగా మారిపోయాడు. ఏడాదికి ఒక్కసారి మాత్రం చుట్టపుచూపుగా వచ్చి చూసి పోతూంటాడు," అన్నాడు దేవయ్య.

"సరే, కూతుళ్ళసంగతేమిటి?" అని ప్రశ్నించాడు యోగి.

"పెద్దమ్మాయికి మేం ఎంతపోరినా చదువుసంధ్యలపట్ల ఆసక్తివుండేది కాదు. సరి పోనీలే అనుకుంటే, దానికి పదహారేళ్ళ వయసులో పెద్దజబ్బుచేసి, ఎలాంటి మందులకూ నయంకాక, నూరేళ్ళు నిండిపోయాయి," అన్నాడు దేవయ్య బాధగా.



యోగి కొద్దిసేపు మౌనంగా వూరుకుని, ''మరి చివరి అమ్మాయి మాట ఏమిటి?'' అన్నాడు.

ఆ ప్రశ్నకు దేవయ్య సంతోషంగా, ''స్వామీ! ఆమెవల్లనే నేనూ, నా భార్యా అంతో ఇంతో సుఖంగా బతికివున్నాం. నా చిన్నకూతురు చక్కగా పాడుతుంది. సంగీతం బాగా నేర్చు కున్నది. ఇరుగుపొరుగు పిల్లలకు సంగీతం పాఠాలు చెబుతూ, నన్నూ నా భార్యనూ కని పెట్టుకుని ఇంటనే వున్నది,'' అన్నాడు.

యోగి, ఆ జవాబుకు తృప్తిగా తలాడించి, ''చూశావా! నువ్వు నలుగుర్ని కన్నావు. అందర్నీ ప్రేమగా, సమానంగానే పెంచావు. అయినా ఆ నలుగురూ నాలుగు రకాలుగా తయా రయ్యారు. దీనికి నీ బాధ్యతెంతో, కోట్ల కోట్ల మానవుల సృష్టికి కారకుడనే, ఆ సృష్టికర్త బాధ్యత కూడా అంతే,'' అన్నాడు.

దేవయ్యకు ఆ సమాధానం తృప్తి కలిగించ లేదు. అది గ్రహించిన యోగి, ''నువ్వు మొదట్లో తెలియబరిచిన సందేహాలకు జవాబు కాస్త వివరంగా చెబుతాను విను. జీవితంలో ఎదురయ్యే కష్టసుఖాలకు, జయా పజయాలకు అనేక కారణాలుంటాయి. మనిషి సాధించే విజయాలకు తానే కారణం అనుకున్నప్పుడు, ఓటములకు కూడా తానే బాధ్యత వహించాలి కదా? పైగా భగవంతుడు, మనుషుల మధ్య తేడాలను, పగ ద్వేషాల్లాంటి వాటిని, అలా చూస్తూ ఊరుకున్నాడను కోవడం సరికాదు. ఆయన మనుషుల కర్మ లకు - అంటే మనం చేసే పనులకు తగిన ఫలితాలను, మంచి-చెడుల రూపంలో ఇస్తూంటాడు. కొన్నిటికి ఫలితాలు అప్పటి కప్పుడే లభిస్తాయి. మరికొన్ని కర్మఫలితాలను అనుభవించడానికి చాలాకాలం పట్టవచ్చు. భగవత్ శక్తిని లోతుగా ఆలోచించి అర్థం చేసుకోవాలేతప్ప, తప్పుపట్టి ప్రయోజనం లేదు కదా!'' అన్నాడు.

ఈ జవాబు దేవయ్యకు తృప్తి కలిగించి వుండాలి. అతడు భక్తిపూర్వకంగా యోగి పాదాలకు నమస్కరించాడు. యోగి, అతణ్ణి దీవించి మౌనంగా ధ్యానమందిరంకేసి వెళ్ళి పోయాడు.





# ఏది ఎవరిది?

అరుణపురంలో వీరమల్లు అనే పేరుమోసిన దొంగ ఉండేవాడు. వాడు ఇళ్ళకు కన్నాలు వేసీ, దారులు కాచీ ప్రజలను దోచుకుని తన జీవనం సాగించేవాడు.

ఒక రాత్రి వీరమల్లు ఒక ఇంటికి కన్నం వెయ్యబోతూ ఉండగా వాడికి లోపలివాళ్ళు మేలుకుని ఉన్నట్టు తెలిసింది. ఇద్దరు వ్యక్తులు ముఖ్యమైన సంగతులు ఏవో మాట్లాడు కుంటున్నారు.

ఒక యువకుడు తన తల్లితో, ''అమ్మా, నేను ఒక ముఖ్యమైన పనిమీద రేపు తెల్ల వారుతూనే పొరుగూరు వెళ్ళాలి. అందుకని నాకు నాపాలు అన్నమూ, మట్టిపాలు అన్నమూ మూటలు కట్టి ఇయ్యి,'' అన్నాడు.

తల్లి, ''సరేలే అలాగే కట్టిస్తాను నాయనా!'' అన్నది. తరవాత తల్లీ కొడుకులు ఇద్దరూ నిద్రపోయారు.

సంభాషణ విన్న వీరమల్లు తాను వచ్చిన పని కూడా మరిచిపోయాడు. వాడికి కొడుకు అన్న మాటలు కొంచెం కూడా అర్థం కాలేదు. వాటి అర్థం ఏమిటో తెలుసుకోవాలని వాడికి పట్టుదల పుట్టుకొచ్చింది. తెల్లవారినదాకా కంటిపైన రెప్పవాల్చకుండా వాడు అక్కడే నిలబడ్డాడు.

తెల్లవారుఝామున ఇంటిలో ఉండే తల్లీ కొడుకులు నిద్ర లేచారు. కొడుకు ప్రయాణా నికి సిద్ధమవుతూంటే, రాత్రి వాడితో చెప్పినట్టే తల్లి వాడికి రెండు మూటలు కట్టి ఇచ్చింది.

తల్లి ఇచ్చిన రెండు మూటలూ తీసుకొని కొడుకు ఇంటి నుంచి బయలుదేరాడు.

అతనికి కొంచెం వెనకగా వీరమల్లు కూడా బయలుదేరాడు.

వాళ్ళు చాలాదూరం నడిచారు. మధ్యాన్న మయింది. యువకుడు అన్నం తిని విశ్రాంతి తీసుకోవడానికి నీళ్ళదాపులనున్న ఒకచెట్టు నీడన కూర్చున్నాడు.

వీరమల్లు కూడా అదే నీడన, యువకుడికి కొంత దూరంలో కూర్చున్నాడు.

యువకుడు వీరమల్లుకేసి చూసి, తన తల్లి కట్టి ఇచ్చిన మూటలు రెండూ విప్పి, ఒకటి తన ముందు ఉంచుకుని, రెండవది వీరమల్లు ముందు పెట్టాడు.

ఆ యువకుడి ప్రవర్తన వీరమల్లుకు ఎంతో ఆశ్చర్యం కలిగించింది. ఈ యువకుడు తనను ఎరగడు. తాను యువకుణ్ణి ఎరగడు. అయినా ఆ యువకుడు తాను అడగకుండానే తనకు ఆహారం పెట్టాడు.

బాగా ఎరిగివున్న వాళ్ళకూ కావలసినవాళ్ళకూ కూడా జన్మలో ఎన్నడూ ఎలాంటి ఉపకారమూ చెయ్యని వీరమల్లుకు యువకుడి ప్రవర్తన ఎంతో వింతగా తోచింది.

తన అనుమానం తీర్చుకునేటందుకు మంచి సమయం అనుకుని వీరమల్లు, ''అయ్యా, నాకొక సందేహం. ఆ సందేహాన్ని తీర్చినట్టయితే మీరిచ్చిన ఆహారం పుచ్చుకుంటాను,'' అన్నాడు యువకుడితో.

''అడుగు,'' అన్నాడు యువకుడు.

''నా వృత్తి దొంగతనాలు చెయ్యటం. అది తప్ప బతకడానికి మరొక మార్గం నాకు తెలియదు. నేను ఎప్పటిలాగే నిన్న రాత్రి మీ ఇంటికి కన్నం వెయ్యడానికి వచ్చి, నువ్వు మీ అమ్మతో అన్న మాటలు విన్నాను. ఎంత ఆలోచించినా వాటికి అర్థమేమిటో తెలియలేదు. అది తెలుసుకుందామనే రాత్రంతా మేలుకొని నీ వెంటబడి వచ్చాను,'' అన్నాడు వీరమల్లు.

యువకుడు చిన్నగా నవ్వి, ''చూడు, నేను తినే అన్నం మట్టిపాలు అన్నం. నీకిచ్చినది నాపాలు అన్నం,'' అన్నాడు.

''ఆ మాటే అర్థం కాలేదు. నువ్వు తిన్నది నీ పాలు అవుతుంది గానీ, నేను తినేది నీ పాలు ఎలా అవుతుంది?'' అని వీరమల్లు అడిగాడు.

''నేను తిన్నది ఒక పూట కూడా ఉండదు. అది జీర్ణమై మట్టిపాలు అయిపోతుంది. కాని నేను నీకు పెట్టినది పుణ్యం రూపంలో నాకు శాశ్వతంగా దక్కుతుంది. ఎదుటివారికి చేతనైన ఉపకారం చేయడంలోనే మనిషిజన్మకు సార్థకత లభిస్తుంది. నువ్వు దొంగతనాలు చేసి సంపాదించినది అనుభవిస్తున్నావు. అది ఖర్చు అయిపోతున్నది. కాని నువ్వు ఇతరులకు చేసినది ఏమిటి?'' అన్నాడు యువకుడు.

ఈ మాటతో దొంగకు కళ్ళు తెరుచుకున్నట్టు అయింది. వాడు తన వృత్తి మానేసి, కష్టపడి పనిచేసి, ఇతరులకు సహాయం చేస్తూ జీవించటం నేర్చుకున్నాడు.




ఇదొక చందమామ కానుక
అజేయుడు గరుడుడు!
26
చిత్రాలు: మహేష్
సేనాధిపతి నరేంద్రదేవుడు ఆదిత్యుణ్ణి బంధించి తెస్తానని బయలుదేరి వెళ్ళి, మార్గమధ్యంలో మొసళ్ళవాతబడి రెండుకాళ్ళూ, ఒక చెయ్యీ పోగొట్టుకున్నాడు. అప్పటికే సర్పదేశాన్ని చేరుకున్న ఆదిత్యుడు, గుహాలయంలో ప్రవేశించాడు. అతడి అనుచరులు రవీంద్రదేవుణ్ణీ, భూతవైద్యుణ్ణీ పట్టి బంధించారు. మాంత్రికుడు నాగబంధు మూడు తలల సర్పంగా మారి ఆదిత్యుడితో ముఖాముఖి పోరాటానికి దిగాడు. ఆదిత్యుడి తలపాగాలోని గరుడుడి ఈక గరుడుడి రూపంలో మారి సర్పాన్ని ఛిన్నాభిన్నం చేసి మండుతూన్న అగ్నికుండంలో పడవేసింది.


మూడు తలల సర్పం అగ్నికుండంలో పడగానే, కీచుకంఠంతో తాంత్రికుడి భయంకరమైన అరుపు వినిపించింది.
అతి దారుణమైన మరణం!
గరుడా! ఎప్పుడో ఒకప్పుడు నీ అంతం చూస్తాను... ఆ.....
భయంకరమైన శబ్దంతో గుహాలయం కూలి నేల మట్టమయింది.
రండి, దూరంగా వెళ్ళిపోదాం!


ప్రభూ! తమరు ఘోర అపాయం నుంచి మమ్మల్ని కాపాడారు!
తమరు రాకుంటే అన్యాయంగా, బలి అయిపోయి ఉండేవాడు!
గరుడుడు ధూళిలో నుంచి వెలుపలికి వచ్చి, నేలమీదికి వాలుతూ, ఆదిత్యుడయ్యాడు. కొండజాతి ఆలుమగలు, భయాశ్చర్యాలతో అతన్ని సమీపించారు.
మీకు ఇకపై ఎలాంటి భయమూ లేదు. మీవాళ్ళ దగ్గరికి వెళ్ళండి. ప్రశాంతంగా జీవించండి!

ఆదిత్యుడు తమను కొండ దిగువకు తీసుకు వెళ్ళమని కోయ యువతీయువకుల జంటతో చెప్పాడు.

నదిని సులభంగా దాటగల ప్రాంతానికి మమ్మల్ని తీసుకువెళ్ళండి!

చిత్తం, ప్రభూ!

కొంతదూరం వెళ్ళాక, వారికి చెట్టుకు ఆనుకుని బాధపడుతూన్న నరేంద్ర దేవుడు కనిపించాడు. అతడు పశ్చా త్తాపంతో కుమిలిపోతున్నాడు.

నాన్నా! రండి, చంద్రపురికి తిరిగి వెళదాం!

వద్దు. రవీంద్రా, వద్దు! నేను ఇక్కడే తనువు చాలిస్తాను. రాజుగారికి నా క్షమాపణలు చెప్పు.

భూతవైద్యుడు, ఆదిత్యుణ్ణి సమీపించ డానికి ప్రయత్నించాడు. అయితే, ఆది త్యుడి భటులు వాణ్ణి అడ్డుకున్నారు.

ప్రభూ, నన్ను ఇక్కడే వదిలేయండి. ఈ జన్మకు చంద్రపురిలో అడుగుపెట్టను.

అతన్ని వదిలిపెట్టండి! రవీంద్రదేవుణ్ణి మాత్రం మనతో తీసుకురండి.

ఆదిత్యుడూ, రవీంద్రదేవుడూ వెంట రాగా, అంగరక్షకులూ, భటులూ నదిని జాగ్రత్తగా దాటసాగారు.

అవలి గట్టును చేరగానే, మనం వస్తూన్న వార్తను రాజభవనానికి తెలియజేయండి.


ప్రధానమంత్రి ఆదిత్యుడు తిరిగి వస్తున్నాడని తెలియగానే చంద్రపురి రాజూ, ప్రజలూ అమితానందం చెందారు.
ఆదిత్యుడు భవనద్వారం దగ్గరికి వచ్చేశాడు. అరుణా! నేను వెళ్ళి అతనికి స్వాగతం చెబుతాను.
అలాగే, మహాప్రభూ! నేను తమ ఇరువురి కోసం వేచి వుంటాను.
రాజు ఆదిత్యుణ్ణి చూడగానే రెండు చేతులూ సాచి కౌగిలించుకున్నాడు.
ప్రభూ! తమ ఆశీస్సులతో సురక్షితంగా తిరిగి వచ్చాను.
ఆదిత్యా! జయప్రదంగా తిరిగివచ్చావు! అభినందనలు! నిన్ను చూడడానికి ప్రజలు అమితోత్సాహంతో ఎదురుచూస్తున్నారు!
అంతలో అరుణ రాజభవనం వెలుపలికి వచ్చింది.
ఆదిత్యా! నాకు సంతానం లేదు. అరుణను నా కుమార్తెగా దత్తత చేసుకుంటున్నాను. నువ్వామెను వివాహం చేసుకుంటావు కదూ?
తమ ఆజ్ఞను శిరసావహిస్తాను ప్రభూ!
రాజభవనం ముందుఆనందోత్సాహాలతో గుమిగూడిన ప్రజలు ఆదిత్యుడికి జయ జయ ధ్వానాలు చేయసాగారు.
మాతృభూమిని రక్షించిన వీరుడికీ స్వాగతం!
ప్రధానమంత్రికీ, జై!
వీర ఆదిత్యుడికీ, జై!
మిత్రులారా! మిమ్మల్ని చిరకాలం ఏ కొరతా లేకుండా చూసుకోవడానికి సిద్ధంగా ఉన్నాను.
రాజుగారి మాటలనువిందాం!










హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. కొంతసేపటికి నిశ్శబ్దం ఏర్పడ్డాక రాజుగారి దృష్టి రవీంద్రదేవుడి మీదికి మళ్ళింది.




ఆదిత్యుడు తన తలపాగాలో ఉన్న ఈకను తీసి, గరుడ విగ్రహం పాదాలవద్ద ఉంచి భక్తితో కళ్ళు మూసుకున్నాడు. అప్పుడొక దివ్యస్వరం వినిపించింది.




(అయిపోయింది)




## దారిచూపగలరా?

హాతీ ఏనుగు మీదికి ఎక్కి మోనిష్ కోతిపిల్ల తెగ సంబరపడిపోతోంది. నేలమీద నిలబడ్డ బుల్లి మిత్రా కోతి కూడా ఏనుగునెక్కి స్వారీ చేయాలని ఉబలాటపడుతోంది. అది ఏనుగు మీదికి ఎక్కి మోనిష్ వెనక చేరుకోడానికి మీరు దారిచూపి సాయపడగలరేమో చూడండి!

## కనుగొనండి

ఆ... అవును! పరిశీలించి చూస్తే ఈ దృశ్యంలోని చిత్రం ఒకటి సరిగ్గా లేదనిపిస్తోంది. వింతగా ఉన్న దానిని మీరు కనుగొనగలరా?

## వెలికి తీయండి!

ఈ చెట్టు చాలా వింతయినది. అయ్యబాబోయ్! అడవిలోని జంతువులన్నీ ఈ చెట్టులో దాగి ఉన్నట్టున్నాయి.వాటిని కనిపెట్టి వెలికి తీసుకురాగలరేమో ప్రయత్నించి చూడండి!

## తేడాగల ఉడత!

చూడ్డానికి ఈ నాలుగు ఉడతలూ ఒకేవిధంగా ఉన్నప్పటికీ, వీటిలో ఒక్కటి మాత్రం మిగతావాటికన్నా భిన్నంగా ఉన్నది. ఆ తేడాగల ఉడతను పట్టుకోగలరా?

## రంగులు వేయండి

ఆహా! రవి కోడిపుంజు గిటార్‌ను తెగ వాయించేస్తోంది. చిత్రకారుడు ఈ బొమ్మకు రంగులు వేయడం మరిచాడు. ఈ గిటార్ విద్వాంసుడికి రంగులు వేసి మరిన్ని అందాలు సమకూర్చగలరేమో చూడండి!

సమాధానాలు (66 పేజీలో)






# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జూలై 2003 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

మార్చ్ 2003 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:

అనిల రేణు
స్టాఫ్ క్వార్టర్స్ ఎల్-14
కాకతీయ యూనివర్సిటీ,
వరంగల్-506009.(ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో: బతుకు తెరువు కోసం!
రెండవ ఫోటో: వేశాడు ఎద్దుకు వేషం!!

## వినోదసమయం సమాధానాలు (పేజీలు 64-65)

**వెలికితీయండి:** 14 జంతువులు: ఎలుక, సీతాకోక చిలుక, బల్లి, ఉడత, జింక, గద్ద, పిల్లి, నక్క, చుక్కలపురుగు, చేప, బాతు, కుందేలు, గబ్బిలం, తాబేలు.

తేడాగల ఉడత: బి

**కనుగొనండి:** పాము తోకకు బదులుగా మరొక తల ఉంది.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

